**Colgate**

# Dr. Rabbit's Puzzle

Smita has an appointment for her dental checkup.
Can you find the way for her in 20 seconds or less ?

START

SCHOOL

DENTIST

FINISH

BOOK STORE



An Amazing Trip!







# చందమామ



సంపుటి 101 డిసెంబరు 1999 సంచిక 4

ఈ సంచికలో...

## కథలు



## జానపద సీరియల్



## పౌరాణిక సీరియల్



## పురాణగాథలు



## చారిత్రక విశేషాలు



## శీర్షికలు



ఈ నెల విశేషాలు



స్వర్ణ సింహాసనం


విధి వైపరీత్యం!


ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం

సగం దీవెన – సగం శాపం


Printed and Published by B. Viswanatha Reddi at B.N.K Press Pvt. Ltd., Chennai 600 026 on behalf of Chandamama India Limited, Chandamama Buildings, Vadapalani Chennai 600 026. Editor Viswam

మీ వాళ్ల కోసం
మనసారా
ముచ్చటగా ఇవ్వతగ్గ
ఏకైక బహుమతి!



# చందమామ

వారి భాషలో
వారితో మాట్లాడే
చందమామ ఒకటివ్వండి!

అస్సామీ, బెంగాలీ, ఇంగ్లీషు, గుజరాతీ, హిందీ, కన్నడ, మలయాళం, మరాఠీ, ఒరియా, సంస్కృతం, తమిళం, తెలుగు

అక్కడెక్కడో దూరంగా వున్న మీ వాళ్లకి
చందమామ వెన్నెల చల్లదనం కబుర్లు పంపండిక!

చందా
ఎయిర్ మెయిల్ ద్వారా అన్ని దేశాలకు,
ఆరు సంచికలు రూ. 300
పన్నెండు సంచికలు రూ. 500

మన దేశంలో బుక్ పోస్ట్ ద్వారా
పన్నెండు సంచికలు రూ. 120

సొమ్ము డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా గానీ మనిఆర్డరు ద్వారాగాని చందమామ ఇండియా లిమిటెడ్ పేరిట ఈ క్రింది చిరునామాకు పంపండి.

PUBLICATION DIVISION
CHANDAMAMA INDIA LIMITED
CHANDAMAMA BUILDINGS, VADAPALANI, CHENNAI-600 026

సంచాలకులు
చక్రపాణి
బి. నాగిరెడ్డి
సంపాదకుడు
విశ్వం
డిజైన్ & సాంకేతిక
సలహాదారుడు
ఉత్తమ్
ప్రచురణకర్త
బి. విశ్వనాధరెడ్డి
డైరక్టర్ మార్కెటింగ్
వి. మధుసూదన్

ముఖ్యకార్యాలయం
చందమామ బిల్డింగ్స్
వడపళని, చెన్నయ్-600 026
ఫోన్: 4841778, ఫ్యాక్స్:
4835298

ఇతర కార్యాలయాలు
భువనేశ్వర్
116-బి, బి.డి.ఎ, డ్యూప్లెక్స్ హౌస్,
బారముండ, భువనేశ్వర్-751 003
ఒరిస్సా. ఫోన్:450 534

ఢిల్లీ
ఫ్లాట్ నం. 415, 4 ఫ్లోర్
ప్రతాప్ భవన్
5, బహదుర్‌షా జఫర్ మార్గ్
ఢిల్లీ-110 002 ఫోన్: 2270199

ముంబాయి
నవభవన్ కో-ఆపరేటివ్ సొసైటీ
లిమిటెడ్
2 ఫ్లోర్, డి-20
సిద్ధివినాయక టెంపుల్ దగ్గర
వీర్ సావర్కర్ మార్గ్, ప్రభాదేవి
ముంబాయి-400 025
ఫోన్: 4370118, 4373251



## చేయీ చేయీ కలిపి మీతో...

"ఎక్కడున్నావు, చందమామా?" చాలామంది ఈ ప్రశ్న బిగ్గరగానే అడిగితే, మరింత మౌనంగా ప్రశ్నించుకున్నారు, తమ ప్రియతమ నేస్తం కోసం పుస్తకాల షాపుల్లోనూ, పోస్ట్‌మేన్ బ్యాగ్‌కేసి చూస్తూ.

మిమ్మల్ని చేరుకోవాలన్న చందమామ తహతహ కూడా అంతాయింతా కాదు. మీరెంతగా తపించారో అంతగానూ మీ కోసం తపించింది.నిజానికి, ఎంత ఆనందంగా వుంది మళ్లీ మీ దగ్గరకి రావడం!

అంతా మన మంచికే అన్నట్లు, మన ఈ ఎడబాటు మన మధ్యగల ప్రేమను రాగాలను మరింతగా పెంచింది. ఒక విషయాన్ని చందమామ ఒప్పుకుని తీరుతుంది. మీ సహృద్భావమూ, తహతహ పత్రిక మళ్లీ మీ ముందుకు రావడానికి ఒక గొప్ప శక్తిగా తోడ్పడ్డాయి.

చందమామ యికపై మీకు మరింత ప్రేమతో, అంకిత భావంతో, ఊహాత్మక శక్తిని జోడించి, తన సేవలను అందజేయాలని ఆశిస్తోంది. నూతన శతాబ్దం ఆరంభంతో పాటు మీ పత్రిక మరిన్ని ఆణిముత్యాలను మీ ముందు ఆవిష్కరిస్తుంది. ఈ సంచికలోనే ఆ కొత్త శీర్షికలకు సంబంధించిన ప్రకటనలు చూడండి.

చందమామ మీకు శుభాకాంక్షలు అందజేస్తూ, నూతన శతాబ్దంలోకి, నూతన శకంలోకి మీతో చేయీ చేయీ కలిపి ముందుకు సాగడానికి ఉత్సాహంతో ఉరకలు వేస్తోంది.

# Eat Healthy,

# Think Better.




The Indian ethos of the unity of mind and body is as ancient as our culture. And this rich Indian heritage has inspired dynamic new motto at Britannia.

The new Britannia captures the very essence of purity, energy and freshness, implicit in all our food products.

After over seven decades of being an inseparable part of your daily life, now Britannia ushers you, into a healthier and tastier future.





# చందమామ

ప్రియమైన పాఠకులకూ, అభిమానులకూ, మిత్రులకూ, శ్రేయోభిలాషులకూ నమస్కారం. ఆనందం - విచారం కలగలసిన ఒక విచిత్రమైన భావోద్వేగంతో నేను ఈ ఉత్తరం రాస్తున్నాను. మీ ప్రియతమ నేస్తమైన చందమామను మళ్ళీ తీసుకు రాగలుగుతున్నందుకు ఎంతో ఆనందంగా వుంది. ఒక సంవత్సరానికి పైగా మీకు దూరం చేసినందుకు విచారమూ కలుగుతున్నది.

ఒకదాని వెనుక ఒకటి శరపరంపరగా ఎదురైన కష్ట నష్టాలనూ, ప్రచురణకు అవాంతరం కలిగించిన అనివార్య పరిస్థితులనూ ఏకరవు పెట్టడం నా ఉద్దేశం కాదు. లక్ష్యం ఉదాత్తమయినప్పుడు దానిని పరిరక్షించే మానవ ప్రయత్నానికి, అది ఎంతటి స్వల్పమయినది అయినప్పటికీ, తప్పక దైవ సహాయం లభిస్తుంది. ఈ సత్యానికి ప్రత్యక్ష నిదర్శనం - ఇవాళ మీ పత్రిక తేజమూ, ఉత్తేజమూ కలగలసి మళ్ళీ మీ చేతులను అలంకరించడం! మీ పత్రికను సంస్కృతం, ఇంగ్లీషు భాషలతో పాటు వివిధ భారతీయ భాషలలో ప్రచురిస్తూ, తద్వారా - భారత దేశపు బాలబాలికలలో ప్రాంతీయ, భాషా విభేదాలు లేకుండా తమ తమ మాతృభాషలలో ఆనందకరమూ, ప్రయోజనాత్మకమూ అయిన పఠనాసక్తిని పెంపొందించడానికి ప్రయత్నిస్తున్నాము. మా ప్రయత్నాన్ని ఆశీర్వదించిన దివ్యశక్తికి కృతజ్ఞతతో నమస్కరిస్తున్నాను.

మానవ ప్రపంచంలో, దైవానుగ్రహం కొందరు పుణ్యపురుషుల ద్వారానే వ్యక్తమవుతూ ఉంటుంది. చందమామ విషయంలో - చిరకాల చందమామ అభిమానీ, ప్రముఖ వాణిజ్యవేత్తా అయిన శ్రీ వినోద్ సేథీ ద్వారా ఆ పాత్ర అభివ్యక్తమయింది. ఈ సందర్భంగా నేను ఆయన్ను మనసారా అభినందిస్తున్నాను. ఆయన ప్రదర్శించిన సృజనాత్మక ఔదార్యం బాలసాహిత్య చరిత్రలో గొప్ప ప్రాముఖ్యతను సంతరించుకోగలదని హామీ ఇస్తున్నాను.

చందమామ పునః ప్రారంభాన్ని కాంక్షించిన అసంఖ్యాకులయిన చందమామ అభిమానులకు హృదయపూర్వక కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను. వారు మా పట్ల కలిగి వున్న సుహృద్భావాన్ని విలువ కట్టలేని అపురూప సంపదగా భావిస్తున్నాము.

పత్రిక చక్కని కథలతో, అందమైన చిత్రాలతో, విజ్ఞాన వినోదాలు విరజిమ్మే వైవిధ్య భరితమైన శీర్షికలతో మరింత ఆకర్షణీయంగా వెలువడనున్నది. కాంపాక్ట్ డిస్క్ లాంటి ఎలక్ట్రానిక్ ఎడిషన్స్‌లోనూ రానున్నది. మన ప్రచురణా సంస్థ ప్రారంభించనున్న నూతన పథకాలను గురించి వీలువెంబడి తెలియజేస్తాము.

అర్ధ శతాబ్దం పైగా నిరంతరాయంగా వెలువడిన మీ పత్రిక మారుతున్న కాలానికి అనుగుణంగా అందులోని మంచిని స్వీకరిస్తూ, చందమామ తన విలక్షణమైన విశిష్ట పాత్రను సమర్థవంతంగా కొనసాగించడానికి, నా సహోద్యోగులూ, నేనూ శాయశక్తులా కృషి చేయగలమని సవినయంగా మనవి చేస్తున్నాను.

మీ
విశ్వసనీయమైన

B. Viswanatha Reddi

బి. విశ్వనాథ రెడ్డి
ప్రచురణకర్త

# చందమామ కబుర్లు

## రోగం కన్నా అపాయకరం!

ప్రపంచ ఆరోగ్య సంస్థ ఆదేశం ప్రకారం న్యూఢిల్లీలోని 'ద ఢిల్లీ సొసైటీ ఫర్ ద ప్రమోషన్ ఆఫ్ ద నేషనల్ యూజ్ ఆఫ్ డ్రగ్స్' అనే జాతీయ ఔషధ సంస్థ భారతీయులు మందులు మాత్రలు వాడే పద్ధతులు, అలవాట్ల గురించి ఒక సర్వే జరిపింది. ఆ సర్వేలో కొన్ని భయంకరమైన విషయాలు బయట పడ్డాయి. డాక్టర్లు తమ వద్దకు వచ్చే రోగులకు హడావుడిగా మందులు రాసి ఇస్తారనీ, రోగులు కూడా ముందూ వెనకలు ఆలోచించకుండా రోగం సహజంగా నయం



కావడానికి ఏమాత్రం అవకాశం ఇవ్వకుండా తొందరపడి వాటిని వాడేస్తున్నారనీ తెలియవచ్చింది. రాజధాని నగరంలోని ఒక ప్రసిద్ధ ఆస్పత్రిలో ఇచ్చే మందుల్లో 61 శాతం యాంటి బయాటిక్స్. చాలా వ్యాధులకు వాటి అవసరమే ఉండదు. అనవసరమైన మాత్రలను వాడడం వల్ల రోగం కన్నా అపాయకరమైన పరిస్థితి ఏర్పడవచ్చు అని నిపుణులు భావిస్తున్నారు. పైగా అనవసరంగా వాటిని కొనిపించడం వల్ల వాటి ధరలు కూడా పెరిగి పోతున్నాయి. మరో విషయం ఏమంటే మనదేశంలో లక్షలాది మంది ప్రజలకు ఏ మందును గాని కొనే శక్తి అసలు లేదు!

## అశ్లీలతను వ్యతిరేకించిన విద్యార్థులు!

కాలేజీల్లో చదివే యువతీ యువకులు అశ్లీలత పట్ల సులభంగా ఆకర్షితులవుతారనుకోవడం తప్పు. ఇటీవల ఒక సుప్రసిద్ధ రచయిత రచించిన ఒక నవలలో నుంచి అశ్లీలమైన వర్ణనలు గల ఒక అధ్యాయాన్ని ఒక సుప్రసిద్ధ



వార పత్రిక పునర్ముద్రించింది. చండీఘడ్‌లోని బి.సి.జి.లో బి.ఏ ఆఖరి సంవత్సరం చదువుతున్న విద్యార్థులందరూ ఆ పత్రికా సంపాదకుడి చర్యను ఖండిస్తూ, నిరసనలు తెలియజేశారు. విద్యార్థులను అభినందిస్తున్నాం!

## పిల్లిని మించిన కుక్క!

మామూలుగా పిల్లి ప్రాణం గట్టిది, అంత త్వరగా చావదు, అంటూ వుంటారు. అయితే ఇటీవల రెండు కుక్కలు తామూ వాటికి తీసిపోమని రుజువు చేశాయి. తాయ్‌వాన్‌లో భూకంపం ఏర్పడి చాలామందిని పొట్టన పెట్టుకున్నది. అయితే 437 గంటల తరవాత, శిథిలాల



నుంచి త్రవ్వి రెండు కుక్కలను పైకి తీశారు. అవి ప్రాణాలతో ఉత్సాహంగా కనిపించాయి. వాటిమీద పడ్డ కుర్చీ వాటి ప్రాణాలు కాపాడింది. దాపున పడివున్న ఫ్రీజర్ నుంచి నీళ్ళు తాగుతూ అవి ప్రాణాలు నిలుపుకున్నాయి!

## మూడవసారి ప్రధానమంత్రి

శ్రీ అటల్ బిహారీ వాజ్‌పేయి అక్టోబర్ 13వ తేదీ మూడవసారిగా భారత ప్రధానమంత్రి పదవీ ప్రమాణ స్వీకారం చేశారు. 1996 మే నెలలో ఆయన మొట్టమొదటిసారిగా 13 రోజులపాటు ప్రధానమంత్రిగా మైనారిటీ ప్రభుత్వానికి నాయకత్వం వహించారు. 1998 మార్చినెలలో ఆయన 18 పార్టీల సంకీర్ణ ప్రభుత్వానికి నాయకత్వం చేపట్టారు. దురదృష్టవశాత్తు ఆ ప్రభుత్వం 13 నెలలకే పడిపోవడంతో దేశం 13వ సారి లోక్‌సభ ఎన్నికలు ఎదుర్కోవలసి వచ్చింది. వీటన్నిటినీ గమనించిన ఒక మాటకారి - 'వాజ్‌పేయి తిరిగి అధికారంలోకి వస్తే 13 సంవత్సరాలు పరిపాలించగలరు' అని చమత్కరించారు.

ఈసారి ఆయనకు చెందిన భారతీయ జనతాపార్టీ మరో 23 పార్టీలతో పొత్తు పెట్టుకుంది. ఆ పార్టీలన్నీ కూడా భారతీయ జనతాపార్టీతో పొత్తు కుదుర్చుకుంటేనే ఎన్నికలలో విజయం, సుస్థిర ప్రభుత్వం సాధ్యం అని భావించాయి. బి.జె.పి. నాయకత్వంలో (నేషనల్ డెమొక్రటిక్ అలయెన్స్) జాతీయ ప్రజాస్వామ్య కూటమి ఏర్పడింది. అక్టోబరు 10వ తేదీ ఏర్పాటయిన 13వ లోక్‌సభలో మొత్తం 540 స్థానాల్లో దాదాపు 300 స్థానాలు గెలుపొందిన ఎన్.డి.ఎ. ప్రభుత్వం ఏర్పాటుకు కావలసిన మెజారిటీ సాధించింది. ఎన్.డి.ఎ. ప్రధాన ప్రత్యర్థి అయిన భారత జాతీయ కాంగ్రెస్ తనతో పొత్తు కుదుర్చుకున్న మరి ఆరు పార్టీలతో కలసి 135 స్థానాలను మాత్రమే గెలుచుకోగలిగింది.

దాదాపు 18 పార్టీలు కలిసి అధికారం చేపట్టడం అన్నది 1998 వ సం॥లోనే మొట్ట మొదటి సారిగా జరిగింది. ఆ నూతన ప్రయోగం చక్కగానే ప్రారంభమయింది. దేశ ప్రజలు సుస్థిర ప్రభుత్వం కోసం ఎదురు చూశారు. ఒక సంవత్సరం పాటు శ్రీ వాజ్‌పేయి అన్ని పార్టీలనూ తన నాయకత్వంలో సామర్థ్యంతో నడిపారు. ఎదురయ్యే క్లిష్ట పరిస్థితులను అధిగమించగలరనే అందరూ భావించారు. ప్రతి రంగంలోనూ అభివృద్ధి కనిపించసాగింది. ప్రతిభావంతుడైన విద్యావంతుడుగా ఆయన మన దేశం నుంచీ, విదేశాల నుంచీ మన్ననలు పొందారు. ప్రతి సమస్యనూ నిదానంగా దృఢ చిత్తంతో పరిశీలించి దేశ క్షేమానికి భంగకరం కాకుండా జాగ్రత్త పడేవారు. అయినప్పటికీ భాగస్వామ్య పార్టీలు ఏవేవో కారణాలు చూపి సంకీర్ణం నుంచి వైదొలగడంతో దేశం మరొకసారి ఎన్నికలను ఎదుర్కోవలసి వచ్చింది. వాజ్‌పేయి ఆ మధ్యకాలంలో జరిపిన సమర్థ పాలన పట్ల ఏర్పడిన మంచి పేరు కారణంగా మనదేశంలో అధిక సంఖ్యాకులు ఆయన్ను మళ్ళీ ప్రధానిని చేయాలనుకున్నారు. ఆయన మూడవ సారి ప్రధాని అయ్యారు.



సమర్థ వంతమైన ఆయన నాయకత్వంలో భారతదేశం మరింత శక్తివంతంగా, చైతన్యదీప్తితో ముందుకు సాగగలదని ఆశిద్దాం!

బేతాళ కథలు

## ప్రజలు-చదువు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు "రాజా, ఇంత అర్ధరాత్రి వేళ, భూతప్రేతాలూ, విషసర్పాలూ విచ్చల విడిగా తిరుగాడే శ్మశానంలో, ఏ ఆశయ సాధనకు నువ్విన్ని కష్టాలను సహించగలుగుతున్నావో అర్థం కాకుండా వున్నది. నువ్వెన్నుకున్న ఆశయం నీకు అత్యుత్తమమైనదిగా తోచుగాక! కాని, దాని సాధనకు ఎంచుకున్న మార్గం ఉత్తమ మైనదో కాదో ఆలోచించావా? ఎందుకంటే ఒక్కొక్కసారి ఎంతో వివేకవంతులైన వాళ్ళు కూడా, తమకు మేలు జరుగుతుందని భావించి, కీడుకు దారి తీసే నిర్ణయాలు చేయడం జరుగుతుంటుంది. ఇందుకు

Sankar



ఉదాహరణగా, జయచంద్రుడనే రాజు కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

మహేంద్రగిరినేలే మహారాజు జయచంద్రుడు సకల శాస్త్రాలూ చదివినవాడు. ఆయన ప్రజారంజకంగా రాజ్యపాలన చేస్తున్నాడు.

ఒకసారి జయచంద్రుడు, తన మంత్రి ధీరవర్మతో కలిసి మారువేషంలో నగర సంచారం చేస్తూ, ఒక ఇంట్లో నుంచి ఏదో గొడవ వినబడి లోపలకు వెళ్ళాడు.

ఆ ఇంట్లో గౌరి అనే పదేళ్ళ పిల్లకు నాలుగు రోజులుగా అనారోగ్యం. ఆ రోజు కనుమ పండుగ కావడంతో, ఆమె చేత బలవంతంగా స్నానం చేయించారు. ఇప్పుడా పిల్లకు వాతం కమ్మింది. వైద్యుడు వచ్చి జరిగింది తెలుసుకుని ఇంటిల్లపాదినీ చీవాట్లు పెడుతున్నాడు.

"పిల్లదానికి ఆయువుంటే బ్రతుకుతుంది. లేకుంటే లేదు. అంతేకాని శాస్త్రం తప్పం. అందుకు మమ్మల్ని నిందించే మాటైతే, నీ వైద్యం మాకక్కర్లేదు!" అంటున్నాడు ఇంటిపెద్ద.

వైద్యుడు మారు మాట్లాడకుండా, ఆ పిల్లకు వైద్యంచేసి, "అదృష్టవశాత్తూ గండం గడిచింది!" అన్నాడు.

"గండం గడవడానికి కారణం, అదృష్టం కాదు, ఆచారాన్ని తప్పకుండా ఆచరించడం. అలాంటి వారిని దేవతలు దీవిస్తారు!" అన్నాడు ఇంటిపెద్ద.

ఈ దృశ్యం కళ్ళారా చూసిన జయచంద్రుడికి మనసు పాడైంది. ఆయన అక్కడి నుంచి రాజమందిరానికి వెళ్ళాక, మంత్రి ధీరవర్మతో, "మంత్రివర్యా! మన దేశంలోని ప్రజల్లో మూర్ఖత్వం బాగా ప్రబలినట్టు తోస్తున్నది. దీన్ని నివారించడం మన తక్షణ కర్తవ్యం. మీరేమంటారు?" అని అడిగాడు.

"మూఢాచారాలు మన ప్రజల్ని మూర్ఖుల్ని చేశాయి. వాటిని నిరసిస్తూ శాసనాలు చేస్తే మంచిది," అని మంత్రి సలహా ఇచ్చాడు.

జయచంద్రుడా ప్రకారం శాసనాలు చేశాడు.

ఈ శాసనాలు ప్రజలకు నచ్చలేదు. సంప్రదాయాన్ని వ్యతిరేకిస్తున్నాడని వాళ్ళకు కోపం వచ్చింది. వాళ్ళందరూ కలిసి వినాయకుడనేవాణ్ణి తమ ప్రతినిధిగా ఎన్నుకుని, రాజు వద్దకు రాయబారిగా పంపారు.

వినాయకుడు, జయచంద్రుణ్ణి కలుసుకుని, "ప్రభూ! తరతరాలుగా పాటిస్తున్న మన సంప్రదాయాలను, మీరు తప్పు పడుతున్నారు. ఇది ప్రజలలో ఎంతో కలవరం

కలిగిస్తున్నది. మీరు వెంటనే శాసనాలను రద్దు చెయ్యకపోతే తిరుగుబాటు వస్తుంది," అంటూ హెచ్చరించి వెళ్ళాడు.

జయచంద్రుడికి కోపం వచ్చింది. ఆయన వినాయకుణ్ణి ఖైదు చేయాలనుకున్నాడు. అప్పుడు ధీరవర్మ, ఆయనను వారించి, "ప్రభూ! ఎండమావిలో నీరు తాగగలం కానీ, మూర్ఖుణ్ణి ఎదిరించలేం. వినాయకుణ్ణి ఖైదు చేస్తే, అతడు ప్రతినిధిగా వున్న ప్రజలందర్నీ రెచ్చగొట్టినట్టవుతుంది. తిరుగుబాటు నిజంగానే వస్తుంది," అన్నాడు.

"అయితే, ప్రజల మూర్ఖత్వాన్ని భరించి ఊరుకోవడమేనా? అమాయకులు ప్రాణాపాయానికి గురవుతుంటే కళ్ళప్పగించి చూడడమేనా? ఈ దేశానికి ఏలికనయుండీ, నేనేమీ చేయలేనా?" అన్నాడు జయచంద్రుడు.

ధీరవర్మ ఏమి జవాబు చెప్పక పోయేసరికి రాజు, వినాయకుణ్ణి పిలిపించి, "నా శాసనాల అమలును వాయిదా వేస్తున్నాను. నువ్వు శ్రద్ధగా చదువుకో. చదువు పూర్తయ్యాక కూడా నీకు శాసనాలు తప్పని తోస్తే, వాటిని తొలగిస్తాను, సరేనా?" అన్నాడు.

వినాయకుడు దీనికి అంగీకరించాడు. ఐదు సంవత్సరాలపాటు వాడు ఎంతో శ్రద్ధగా చదువుకుని, ఎన్నో విశేషాలు తెలుసుకుని రాజును చూడవచ్చాడు.

"ఇప్పుడు నువ్వేమంటావు?" అని ప్రశ్నించాడు జయచంద్రుడు.

"సంప్రదాయం పేరిట దేశమంతటా ఎన్నో మూఢాచారాలు ఏర్పడ్డాయి. వాటిని తొలగిస్తే తప్ప, దేశం అభివృద్ధి మార్గంలో



నడవదు," అన్నాడు వినాయకుడు.

"ఆహా, తెలుసుకోవలసిన విషయమే తెలుసుకున్నావు! ఇక శాసనాలు అమలు జరిపే బాధ్యత నీదే!" అన్నాడు జయచంద్రుడు సంతోషంగా.

"వాటిని అమలు జరపడం వల్ల, నాకేం లాభం?" అన్నాడు వినాయకుడు.

"నీకు రాజోద్యోగం ఇస్తాను. నెలకు వెయ్యి వరహాల జీతం ఏర్పాటు చేస్తాను," అన్నాడు జయచంద్రుడు.

"ప్రభూ! నేను ప్రజాప్రతినిధిని. నాకు వెయ్యి వరహాల నెల జీతం. తమరు రాజు — అంటే తమరూ ప్రజాప్రతినిధే కదా! మరి తమరి నెలజీతమెంత?" అని అడిగాడు వినాయకుడు.

ఆ ప్రశ్న జయచంద్రుడికి కోపం తెప్పిం



చింది. ఆయన తీవ్ర స్వరంతో, "తరతరాలుగా మా పూర్వీకులీ దేశాన్నేలారు. నేనీ దేశానికి రాజును. నీకూ నాకూ పోలికేమిటి?" అన్నాడు.

వినాయకుడు చిన్నగా నవ్వి, "పుట్టుక వల్ల రాజయ్యారు తమరు. ప్రజలెన్నుకున్న ప్రతినిధిని నేను. ఒకానొక మూఢాచారం తమను రాజును చేసింది. మూఢాచారాలను తొలగిస్తూ తమరు శాసనాలు చేశారు. అంటే — మన దేశంలో రాజరికం పోవాలనే కదా!" అన్నాడు.

జయచంద్రుడు తెల్లబోయాడు. అతడికేం జవాబివ్వాలో తెలియక, మంత్రికి కబురంపాడు.

ధీరవర్మ వచ్చి వివరాలు తెలుసుకుని, వినాయకుడితో, "నీ ఆలోచన సబబుగా వుంది. ఈ విషయంలో ప్రజాభిప్రాయం సేకరించు. అది నీకు అనుకూలంగా వుంటే, మహారాజు వానప్రస్థాశ్రమం స్వీకరించి, నీకు సింహాసనం అప్పగిస్తారు. అయితే, అంతకు ముందుగా ఒక షరతు. మన దేశంలోని ప్రజలందరికీ, నీకులాగే చదువు రావాలి," అన్నాడు.

వినాయకుడు వెంటనే, "ప్రజలందరికీ చదువంటే మాటలు కాదు. అది ఇప్పట్లో జరిగే పని కాదు. నేను నెలకు వెయ్యి వరహాల జీతం మీద, రాజోద్యోగం స్వీకరించడానికి నిర్ణయించుకున్నాను," అని వెళ్ళిపోయాడు.

ఇది చూసి జయచంద్రుడు ఆశ్చర్యపడి, మంత్రితో, "నువ్వు ఎలాంటి మంత్రం వేశావో తెలియడంలేదు. కానీ నేను రాజసింహాసనాన్ని విడిచిపెడతానని, వినాయకుడికి ఎలా మాటిస్తున్నావా అని, ఆశ్చర్యం మాత్రం నాక్కలిగింది," అన్నాడు.

దీనికి మంత్రి, "ప్రభూ! ప్రజల్లో చదువు లేనంత కాలం, వాళ్ళు మూర్ఖులుగా వుండిపోతారు. మూర్ఖులు మూఢాచారాలనే నమ్ముతారు. రాజవంశీకులే రాజ్యాన్నేలాలనుకోవడం కూడా వాటిలో ఒకటి! వినాయకుడెన్ని చెప్పినా ప్రజలతణ్ణి రాజును చెయ్యరు. ఇది తెలిసే నేనతడికలా మాటిచ్చాను," అన్నాడు.

రాజు కొంచెంసేపాలోచించి, "మన దేశంలోని ప్రజలందరికీ చదువొస్తే, అప్పుడు వారిలో అజ్ఞానాంధకారం తొలగిపోయి మూఢాచారాలు విడిచిపెడతారు. అప్పుడు వినాయకుడు రాజు కావచ్చు గదా! అతడు దానికెందుకు సిద్ధపడలేదు?" అని అడిగాడు.

మంత్రి ధీరవర్మ నవ్వి, "ప్రభూ, సకల శాస్త్రాలూ చదివారు. ఎప్పుడైనా వారసత్వపు రాజరికం మూఢాచారమని తమకు తోచిందా?" అన్నాడు.

ఆ జవాబు వింటూనే జయచంద్రుడు నివ్వెరపోయి, మౌనంగా ఆసనం మీది నుంచి లేచి అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, వినాయకుడు ప్రజలెన్నుకున్న ప్రతినిధి. వాడు చదువుకున్నాక రాజు కావాలని ప్రయత్నించి చివరకు, నెలకు వెయ్యి వరహాల జీతం మీద రాజాస్థానంలో ఉద్యోగం చెయ్యడానికి ఎందుకు నిర్ణయించుకున్నాడు? ఇక, రాజు జయచంద్రుడు — మంత్రి ధీరవర్మ, ఆయనను ఎప్పుడైనా రాజరికం మూఢాచారమని తమకు తోచిందా? అని ప్రశ్నించగానే, ఆసనం మీది నుంచి మౌనంగా ఎందుకు లేచిపోయాడు? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో, నీతల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ఎంత చదివినా మనిషి స్వార్థాన్ని విడిచి పెట్టలేడు. స్వార్థాన్ని విడిచిపెట్టేలా చేయించేదే అసలైన చదువు. అది అందరికీ లభ్యం కాదు. చదువుకోగానే రాజు కావాలని వినాయకుడు ఆశపడ్డాడు. ప్రస్తుతం అలాంటి చదువే ఆ దేశంలో వున్నది. ఆ చదువును అందరికీ అందు బాటులో వుండేలా చేస్తే, ఎవరికి వారే రాజు కావాలనుకుంటారు. ఇప్పుడొక్కడే వినాయకుడు, అప్పుడు దేశమంతా వినాయకులతో నిండిపోతుంది. ఎంత చదువుకున్నా తొలగిపోని మూర్ఖత్వం, ఈ వారసత్వపు రాజరికమే! ఇది అర్థం చేసుకున్న వినాయ కుడు, సాటి ప్రజలతో పోటీ పడడానికి బదులు, రాజు వద్ద ఉద్యోగిగా వుండడమే మేలని గ్రహించాడు. ఇక, రాజు జయ చంద్రుడు హఠాత్తుగా తన ఆసనం మీది నుంచి లేచిపోవడానికి కారణం — ఆయన, మంత్రి మాటల ద్వారా, తన వారసత్వపు సింహాసనం కూడా, ఒకానొక మూఢాచారపు వలయంలో పరిభ్రమిస్తున్నదని గ్రహించడం!" అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం: "వసుంధర" రచన]



# విధి వైపరీత్యం

ఆ ఏడు వర్షాలు ఎడతెరపిలేకుండా కురవడంతో మిన్నూమన్నూ ఏకమైంది. కుశస్థలి నది పొంగి పక్కనున్న చాలా గ్రామాలను ముంచేసింది. నది పక్కనే ఉన్న నాయుడుగారి పల్లపుభూములు మునిగిపోయాయి. అతడు అష్టకష్టాలు పడి చేర్చిన ఆస్తంతా వరదలో కొట్టుకుపోయింది. అతడూ, అతడికుటుంబం ప్రాణాలు దక్కించుకుని మెరక ప్రాంతాలకు చేరారు.

ఇది విన్న నాయుడు మిత్రుడు రాయుడు, నాయుణ్ణి పరామర్శించేందుకు పట్నంనుంచి వచ్చి, "ఏమి, చేస్తాం నాయుడూ, అంతా విధివైపరీత్యం! సంపద వచ్చేటప్పుడు కొబ్బరికాయలో నీరు వచ్చినట్టుగా వస్తుంది; పోయేటప్పుడు ఏనుగు మింగిన వెలగపండులా పోతుంది. విధి ఒకచేత్తో యిచ్చి, ఇంకోచేత్తో తీసుకోవడం వింతేంకాదుగదా!" అన్నాడు.

నాయుడు రెండు క్షణాలు మౌనంగా వూరుకుని, "నేను ముప్పై ఏళ్ళపాటు కష్టపడి అంచెలంచెలుగా చేర్చిన ఆస్తి, ఒక్కరాత్రిలో తుడిచిపెట్టుకుపోవడం మాత్రం ఏం బాగోలేదు. నువ్వనే ఆ విధి ముప్పై ఏళ్ళపాటు కొద్దికొద్దిగా ఎలాయిచ్చాడో, అదేపద్ధతిలో కొద్దికొద్దిగా తీసుకునుంటే, నేనంతబాధపడే వాణ్ణికాను. నువ్వు, విధివైపరీత్యం అనవలసిన అవసరమూ వుండేదికాదు, అవునా?" అన్నాడు.

ఇది విన్న రాయుడు దీర్ఘంగా నిట్టూర్చాడు.

- ఆర్. సత్య






ఒకానొకప్పుడు, దక్షిణ భారతదేశంలో, కౌండిన్య, కాళింది, చంపక, కుంద అనే నాలుగు బలమైన పెద్ద రాజ్యాలూ, ఆరు చిన్నరాజ్యాలూ వుండేవి. అయితే, హైహయ వంశానికి చెందిన పౌరస్వతుడనే ఒక మహావీరుడైన రాజు, మొదట్లో ఒక్క కౌండిన్య దేశానికి మాత్రమే ప్రభువైనప్పటికీ, రకరకాల కారణాల వల్ల మిగిలిన దక్షిణ భారతదేశమంతటా యుద్ధాలూ, దౌత్యనీతులూ సాగించి మొత్తం దక్షిణ భారతదేశాన్నంతటినీ, తన అదుపులోకి తెచ్చుకుని, సువిశాల దక్షిణాపథ సార్వభౌముడుగా విశేషకీర్తి నార్జించాడు.

అంత పెద్ద దేశాన్ని ఎంతో సమర్థవంతంగా చాలాకాలం పాటు పాలించిన పౌరస్వతుడికి, దురదృష్టవశాత్తూ సంతానం లేదు. సంతానహీనుడుగా పౌరస్వతుడు మరణించిన తర్వాత, అతడి తమ్ముడి కుమారుడైన హయగ్రీవుడు రాజయ్యాడు.

హయగ్రీవుడు స్వభావ సిద్ధంగా మంచివాడేగాని, సహస్రాక్షుడిలా పాలించిన పెద తండ్రి పాలనా సామర్థ్యంలో వెయ్యో వంతు కూడా అతడికి లేకపోయింది. హయగ్రీవుడి మంచితనాన్ని, ఆ మంచి తనాన్ని కించపరుస్తున్న అతడి అసమర్థతనూ బాగా అర్థం చేసుకున్న వ్యక్తి, పుళింద భట్టారకుడు.

పుళిందుడు గొప్ప పాండిత్య ప్రకర్ష గల వ్యక్తి. రాజనీతిశాస్త్రమూ, మంత్ర శాస్త్రమూ అతడి అభిమాన విషయాలు. కాశీలో చాలాకాలం విద్యాభ్యాసం సాగించిన పుళిందుడు, పౌరస్వతుడి చివరి రోజుల్లో అతడిని ఆశ్రయించాడు.

**లక్ష్మీ గాయత్రి**



పుళిందుడి పాండిత్య పటిమను గ్రహించిన పౌరస్వతుడు, అతడిని తగు విధంగా గౌరవించి, సింహాసనానికి వారసుడైన హయగ్రీవుడికి గురువుగా నియమించాడు. ఈ విధంగా చాలాకాలం హయగ్రీవుడికి చేరువైన పుళిందుడు హయగ్రీవుడి మంచితనం కారణంగా అతడిని తన కన్నబిడ్డలా అభిమానించాడు. గురువుకు తన పట్లవున్న ఆదరాభిమానాన్ని తలుచుకున్నప్పుడల్లా ఎంతో సంతోషించే హయగ్రీవుడు, అప్పటి వృద్ధరాజగురువు మరణించగానే, తన గురువునే రాజగురువుగా చేసి, తన కృతజ్ఞతను ప్రకటించుకున్నాడు.

గురుశిష్యులిదర్ది మధ్యా అంతటి సన్నిహిత సంబంధం వున్న కారణంగా, పుళింద భట్టారకుడు తన శిష్యుడు మంచి రాజుగా విఫలుడై, ఆత్మన్యూనతతో కుంగిపోవడం చూసి, ఎలాగైనా సరే అతణ్ణి పౌరస్వత మహారాజు కంటే ఎక్కువ ఖ్యాతిపరుడుగా చెయ్యాలని గాఢంగా తపించాడు.

ఒకనాడు హయగ్రీవుడు, అతి కొద్ది మంది భటులను వెంటబెట్టుకుని, కాలక్షేపంగా, సమీపారణ్యంలోకి వేటకు వెళ్ళాడు. అలా వెళ్ళిన కొద్ది సేపటికి, ఒక దుప్పి చెంగున దుముకుతూ కనిపించింది. హయగ్రీవుడు వెంటనే దాని మీదికి బాణంవదిలాడు. బాణం గురి తప్పింది. దుప్పి వేగంగా పరిగెత్తి, క్షణంలో కంటికి కనిపించనంత దూరం పారిపోయింది. నిరాశపడుతూ చూస్తున్న హయగ్రీవుడికి వెనకవేపున భటుల నుంచి ఒక చిన్న నవ్వు వినిపించింది. ఆ నవ్వు ఎంత చిన్నగా శబ్దించిందో, దానిలో అంతర్గతంగా దాగి వున్న అవహేళన, అతడి మనసునుఅంత తీవ్రంగా తాకింది.

వెంటనే గుర్రాన్ని దిగి, భటులందరికేసీ పరిశీలనగా చూశాడు. అందరూ యథాప్రకారం వినయగంభీరంగా వున్నారు. కాని, దెబ్బతిన్న హయగ్రీవుడి మనసుకు మాత్రం, వారి వినయం వెనుక తన పట్ల చులకనభావమూ - ఒక చిన్న దుప్పినే కొట్టలేనివాడివి, పౌరస్వత మహారాజు ఒంటిచేతి మీద పాలించిన ఇంతటి సువిశాల దేశాన్ని ఎలా పాలించగలవయ్యా? అన్న అవహేళనా స్పష్టంగా కనిపించాయి.

అంతే! వారిని ఏమైనా ప్రశ్నించడానికయినా అనర్హుడుగా

భావించుకున్నాడు, హయగ్రీవుడు. మౌనంగా గుర్రం ఎక్కి వెనుదిగిరి నగరాభిముఖంగా బయలుదేరాడు. బిత్తరపోయిన భటులు, ఏమని కూడా అడగలేక, తాము కూడా అతణ్ణి అనుసరించారు.

ఆ మరునాటి ఉదయాన్నే, ధ్యానమగ్నుడై వున్న పుళింద భట్టారకుణ్ణి, "మహారాజు ఆకస్మికంగా మరణించా"రన్న వార్త దాదాపు పిచ్చివాణ్ణే చేసి, అంతఃపురానికి పరుగు తీయించింది. అప్పటికే శోకమూర్తులై అక్కడికి చేరివున్న పరివారం, హయగ్రీవుడి హఠాన్మరణానికి కారణం తెలియక, అల్లల్లాడుతున్నది. హయగ్రీవుడి మృతికి అందరికంటే ఎక్కువగా కుమిలిపోతూ, తన ఇంటికి తిరిగి వచ్చిన పుళిందుడికి, సేవకుడొకడు, ఒక చిన్న దంతపు పెట్టె ఇస్తూ, భయం భయంగా, "ఈ రోజు ఉదయానే మహారాజుగారు పంపారు. ఆ సమయంలో మీరు పూజగదిలో వున్నారు," అన్నాడు.

ఆతృతగా ఆ పెట్టె తెరిచి చూసిన పుళిందుడు, అందులో మహారాజు రాసి పెట్టిన లేఖ ద్వారా సమస్తమూ తెలుసుకుని, మహారాజు ఆత్మహత్య చేసుకున్నాడని గ్రహించి చెప్పలేనంతగా కుమిలిపోయాడు.

హయగ్రీవుడి మరణానంతరం, మహామంత్రి అప్పటికి మూడు సంవత్సరాల పసిబాలుడైన హయగ్రీవుడి కుమారుడికి పట్టాభిషేకం జరిపించి, పరిపాలన అంతా తానే చూసుకోవడం



ప్రారంభించాడు. అయితే సరైన రాజు లేని కారణంగా పౌరస్వత మహారాజు తదనంతరమే అక్కడక్కడా ప్రారంభమైన చిన్న చిన్న తిరుగుబాట్లు రాను రాను పెద్దవై, హయగ్రీవుడి కుమారుడు యుక్తవయస్కుడయ్యేనాటికి, కాళింది, చంపక, కుంద రాజ్యాలు స్వతంత్ర రాజ్యాలయ్యాయి.

ఈ విధంగా, హయగ్రీవుడి కుమారుడి పాలన పూర్తయి, అతడి కుమారుడు పట్టాభిషిక్తుడయ్యే నాటికి, దక్షిణ భారతంలోని మిగిలిన ఆరు చిన్న రాజ్యాలు కూడా స్వతంత్ర రాజ్యాలై, హైహయ వంశీకులు తిరిగి కేవలం కౌండిన్య ప్రభువులుగానే మిగిలారు.

ఆ సమయంలో కౌండిన్య దేశాన్ని పాలిస్తున్న శ్రీదత్తుడు హైహయ



వంశస్థుల్లో పదవరాజు, పౌరస్వతుడి తర్వాత ఐదవతరం వాడు. శ్రీదత్తుడు మంచివాడూ, సమర్థుడే కాని, అతి సున్నిత మనస్కుడు. అతడి పట్టపు రాణి, ఒక మగబిడ్డను కని కన్ను మూసింది. ఆమె పట్ల అమిత ప్రేమ గల శ్రీదత్తుడు, మరొక వివాహం చేసుకోవలసిందని ఎంతమంది చెప్పినా పెడచెవిన పెట్టి, కొడుకును అతి గారాబంగా పెంచి, విద్యాభ్యాసం కోసం, దక్షిణా పథమంతటా ఖ్యాతిగాంచిన వేంటి గురువు కృష్ణచంద్రుడి దగ్గరకు పంపాడు.

ఆ బిడ్డ, కౌండిన్య యువరాజు విజయదత్తుడు, నేడు పరిపూర్ణ యువకుడు. శస్త్రశాస్త్రాల్లో అద్వితీయుడైన మేధావి. ధీశాలిగా నలుగురి మెప్పూ పొందినవాడు. కృష్ణచంద్రుడంతటి గురువుకు ప్రియశిష్యుడై, అతడి చేత శభాష్ అనిపించుకున్న రాజనీతిజ్ఞుడు.

కృష్ణచంద్రుడి వద్ద విజయదత్తుడి విద్యాభ్యాసం పూర్తయింది. కాబోయే రాజులకు కృష్ణచంద్రుడు ఇచ్చే ప్రత్యేక శిక్షణలో వున్నాడతడు. మరొక రెండు నెలల్లో, ఆ శిక్షణ కూడా పూర్తి చేసి, అతడు స్వస్థానానికి తిరిగి వెళ్ళడానికి అనుమతిస్తాడు, కృష్ణచంద్రుడు.

అటువంటి పరిస్థితిలో, ఒకనాటి ఉదయం రాజు శ్రీదత్తుడు పంపగా వచ్చిన భటుడు, మహారాజు, యువరాజును వెంటనే పంపించవలసిందిగా కోరుతున్నారని చెప్పి మహారాజు స్వహస్తాలతో కృష్ణచంద్రుడికి రాసిన లేఖను అందించాడు. ఆ లేఖలో కూడా విజయదత్తుణ్ణి వెంటనే పంపవలసిందిగా అభ్యర్థన వున్నది తప్ప, అందుకు కారణం ఏమిటో లేదు.

కృష్ణచంద్రుడు వెంటనే విజయదత్తుణ్ణి పిలిపించి, విషయం చెప్పి, ప్రయాణానికి సిద్ధం కమ్మని ఆదేశించాడు. కారణం తెలియని ఈ హఠాత్ప్రయాణానికి కలత పడుతూనే, గురువుకు నమస్కరించి, ఆశీస్సులు పొంది, తన ఉత్తమాశ్వాన్ని అధిరోహించి, విజయదత్తుడు బైలుదేరారు.

కొడుకు ఆగమనవార్త విని భవన ప్రవేశ ద్వారం దగ్గరే ఎదురు చూస్తున్న మహారాజు, గుర్రం దిగి తనకు నమస్కరించబోతున్న అతణ్ణి గాఢాలింగనం చేసుకున్నాడు. తండ్రి కళ్ళు రెండూ చమర్చి వుండటం గమనించి,

తండ్రి ఏదో ఆవేదనలో వున్నాడని గ్రహించాడు, విజయదత్తుడు.

ఆ తర్వాత అతడు భోజనాలయ్యాక విశ్రాంతిగా తండ్రి దగ్గర కూర్చుంటూ, "నాన్నా, ఇంత అత్యవసరంగా నన్ను పిలిపించిన కారణం ఏమిటి?" అని అడిగాడు. శ్రీదత్తుడు కొద్ది సేపు మౌనంగా వుండిపోయి, తర్వాత చెప్పటం ప్రారంభించాడు.

"విజయా! మన పూర్వీకుడైన పౌరస్వత మహారాజు మొత్తం దక్షిణాపథాన్నంతటినీ జయించి, చిన్నా, పెద్దా రాజ్యాలన్నింటినీ తనకు సామంత రాజ్యాలుగా చేసుకున్నాడన్న విషయం నీకు తెలిసిందే గదా! ఆ మహారాజు పాలనలో సామంత రాజులందరూ కప్పం కిందా, కానుకల రూపేణా అనేకమైన నిధి నిక్షేపాలనూ, ఎన్నో అపూర్వమైన వస్తువులనూ ఇచ్చారు. వాటిలో వెండి బంగారాలే కాక, జాతిరత్నాలు కూడా ఎన్నో వున్నవి. వాటి వివరాలన్నీ మన వంశంలోని రాజులకు పరంపరగా తెలుస్తూనే వున్నాయి. పౌరస్వతుడి తర్వాత సామంతరాజ్యాలన్నీ వేటికవి స్వతంత్రించినా, ఏ ఒక్క రాజ్యమూ మన రాజ్యంపై దండెత్తి, మనల్ని కొల్లగొట్టుకు పోవాలన్న ఆలోచన చెయ్యకపోవడం చేత, ఇప్పటి వరకూ ఆ నిధి నిక్షేపాలన్నీ భద్రంగా వున్నాయి. ఈనాటికి వాటి మీద వేరొకరి కన్ను పడటం జరిగింది!" అని ఆగాడు.

"ఎవరా వ్యక్తి?" అని విజయదత్తుడు ప్రశ్నించాడు.

శ్రీదత్తుడు ఆ ప్రశ్నకు నిట్టూర్చి, "కుట్రదారులు ఒకరు కాదు, నాయనా ముగ్గురు! దక్షిణాపథంలో మన రాజ్యం మీద, మిగిలిన పెద్ద దేశాలన్నీ ఏకమై కుట్ర సాగిస్తున్నాయి," అన్నాడు.

ఆ జవాబుకు విజయదత్తుడు ఉలిక్కిపడుతూ, "ఏమిటీ! కాళింది ప్రభువు కూడా కుట్రలో భాగస్థుడా?"





అంటూ నమ్మలేనట్టు నొక్కి ప్రశ్నించాడు. అవునని జవాబిచ్చాడు, మహారాజు.

ఊహించని ఆ వార్తకు విజయదత్తుని మస్తిష్కం ఒక్క క్షణం మొద్దుబారి పోయింది. తండ్రి ఆవేదనకు సగం కారణం అతడికి ఆ క్షణానే అర్థమైంది.

పౌరస్వత మహారాజు తదనంతరం, దక్షిణా పథ సార్వభౌమత్వం చేజారి పోయినా కౌండిన్య ప్రభువులు ఏ ఒక్క రాజ్యంతోనూ శత్రుభావంతో ప్రవర్తించ లేదు. శ్రీదత్తుడి తండ్రి, తన కుమార్తె సుమతికి స్వయంవరం ప్రకటిస్తూ, దేశదేశాలకూ ఆహ్వానాలు పంపించాడు. ఆ స్వయంవరంలో వసుమతి, తమ పొరుగునే వున్న కాళింది దేశ రాకుమారుని మెడలో వరమాల వేసి, అతణ్ణి వరించింది. శ్రీదత్తుని తండ్రి ఆనందంగా వారిద్దరికీ వివాహం జరిపించి, తన కుమార్తెను కాళింది దేశపు కోడలిగా సాగనంపాడు.

ఆ రకంగా శ్రీదత్తుడికి బావగారైన కాళింది ప్రభువు మాధవసేనుడు, నిన్న మొన్నటి దాకా కౌండిన్య దేశానికి రాకపోకలు జరుపుతూ మైత్రీ సంబంధాలను కొనసాగించాడు. తన ఏకైక సంతానమైన శ్రీలేఖను విజయదత్తుడికిచ్చి వివాహం చేసి, ఈసారి కాళింది రాకుమారిని కౌండిన్య దేశపు రాణిగా పంపాలనేది వసుమతి ప్రగాఢ వాంఛ. చెల్లెలి కోరికకు శ్రీదత్తుడు ఎంతగానో ఆనందించి, తన అంగీకారాన్ని తెలియజేశాడు. ఆ అన్నా చెల్లెళ్ళ కోరికకు, మాధవసేనుడు ఏనాడూ అభ్యంతరం తెలియజెయ్యలేదు. అటువంటి వ్యక్తి ఈనాడు కుట్రదారులతో చేరడమా?

విజయదత్తుడు మౌనంగా వుండి పోవటం చూసి, మహారాజు, ఓదార్పుగా కొడుకు భుజం తట్టి ఇలా చెప్పాడు.

"నాయనా! ఈ కుట్ర ఎంతవరకు నిజమో తెలుసుకునేందుకు, సైన్యాధ్యక్షుడైన వీరబాహుతో రహస్య సమాలోచన జరిపి, మన గూఢచారి దళాన్నంతటినీ రంగంలోకి దింపాను. పదిరోజుల క్రితం గూఢచారి దళ నాయకుడు, నాకు అందించిన పూర్తి నివేదిక చూడగానే, నాకు మతి పోయినంత పని అయింది.

ఆ నివేదిక గురించి చెప్పబోయే ముందు, ఆ నివేదిక ద్వారానే నాకు తెలిసిన కొన్ని ముఖ్య విషయాలు

చెప్పాలి. ఆ విషయాలు వింటే, సర్వం నీకు అర్థమవుతుంది!

దక్షిణాపథంలోని పెద్ద రాజ్యాలు నాలుగింటిలో ఒకటైన చంపక దేశాన్ని ప్రస్తుతం, మరాళభూపతి పాలిస్తున్నాడు ఇతడి తండ్రి చక్రభూపతి, రాజైన తన అన్నను విషప్రయోగం చేసి చంపి, సింహాసనాన్ని స్వాధీనం చేసుకున్నాడు. ఆ చక్రభూపతి వారసుడైన ప్రస్తుత చంపక ప్రభువు మరాళభూపతి, దౌష్ట్యంలోనూ, కుటిల తంత్రంలోనూ కూడా తండ్రికి వారసుడే! ఇతడికి ఇద్దరు కొడుకులు. రాజ్యానికి వారసుడైన తన పెద్ద కొడుక్కు, చక్రభూపతి అని తన తండ్రి పేరే పెట్టుకున్నాడు, మరాళుడు. ఈ చక్రభూపతి ముమ్మూర్తులా రూపం లోనూ, గుణంలోనూ కూడా, తన తాతనే పోలినవాడు. ఆ తండ్రీ కొడుకులూ దుర్మార్గంలోనే గాక, యుద్ధవిద్యల్లో కూడా ఎన్నదగినవారే! తమ శక్తియుక్తులకు తామే గర్వించే వీరి దృష్టి, తరాల కింద మనకు లభ్యమైన ఐశ్వర్యం పైనా, దక్షిణాపథ సార్వభౌమత్వం పైనా కేంద్రీకరించబడింది.

చంపక దేశానికి కుడివైపున, తూర్పు దిశగా కుంద దేశమూ, ఎడమవైపున, పశ్చిమదిశగా కాళింది దేశమూ వున్నాయన్న సంగతి, నీకు తెలిసిందే! కుంద దేశాన్ని ప్రస్తుతం పాలిస్తున్న వృషభధ్వజుడు వృద్ధుడూ, అసమర్థుడే గాక, నిస్సంతు! దురదృష్టవశాత్తూ, సింహాసనానికి వారసులన దగ్గ దాయాదులు కూడా ఎవరూ లేరు. ఆ



కారణంగా అతడు, చక్ర, మరాళ భూపతుల భల్లూక శక్తియుక్తులకు తేలిగ్గానే వశమై, తాను మాత్రం ఎక్కడికీ కదలలేననీ, కావలసినంత సైన్యాన్నీ, ఆహార పదార్థాలనూ పంపిస్తాననీ మాట యిచ్చాడు. నిజానికి ఈ తండ్రీ కొడుకులిద్దరూ కలిసి, కొద్దిపాటి సైన్యాన్ని తీసుకువెళ్ళినా, ఆ దేశాన్ని అవలీలగా జయించి వుండేవారే! కాని, ముందుగా మన సింహాసనాన్ని కైవసం చేసుకునేదాక, అనవసర యుద్ధాల ద్వారా, మన దృష్టి వారి మీదికి మళ్ళించుకోవటం ఇష్టం లేక, వాళ్ళిద్దరూ కుంద ప్రభువుతో తాత్కాలికమైన సంధి కుదుర్చుకున్నారు.

తర్వాత వారి దృష్టి కాళింది మీదికి మళ్ళింది. మన దేశానికీ, వారి దేశానికీ మధ్యన వున్నది కాళింది. పైగా, మనకూ, కాళింది ప్రభువుకు వున్న బాంధవ్యం

కూడా వారిని కాస్త ఇబ్బంది పెట్టింది. ఈ స్థితిలో, మరాళ భూపతికి మరొక చిక్కు కూడా ఎదురైంది. అది, తన కొడుకు కాళింది రాకుమారి సౌందర్యం గురించి విని, ఆమెను వివాహమాడాలని అభిలషించడం!" మహారాజు శ్రీదత్తుడు తదేక దృష్టితో చెప్పుకుపోతున్న వాడల్లా మరొక్కసారి ఆగాడు.

తండ్రి చెబుతున్న రాజకీయ పరిణామాలను శ్రద్ధగా వింటున్న విజయదత్తుడు తండ్రి చెప్పడం ఆపగానే మరొకసారి ఉలిక్కిపడ్డాడు.

అది గమనించిన మహారాజు, వేదాంతిలా ఒక్క చిరునవ్వు నవ్వి, "భూమినేలే రాజు జీవితం, ముళ్ళ మధ్య గులాబీలాంటిదని పెద్దలు అందుకే అన్నారు నాయనా!" అన్నాడు.

తండ్రి ఆదర వాక్యాల్ని వింటూ మౌనంగా కూర్చున్న విజయదత్తుడి మనసులో రకరకాల ఆలోచనలూ, అనుమానాలూ చెలరేగినై. శ్రీలేఖకూ తనకూ వివాహం జరిపించాలన్న పెద్దల అభిమతానికి అనుగుణంగానే, తామిద్దరూ కూడా బాల్యం నుంచీ, ఒకరి పట్ల ఒకరు గాఢానురక్తి పెంపొందించుకున్నారు. ఈనాటి ఈ రాజకీయ చదరంగంలో, తమ పరస్పరాభిమానం కూడా ఒక పావుగా మారి, ఓటమి చవిచూడబోతున్నది! తను ఎంత దిట్ట అయినప్పటికీ, ఆ పావును బ్రతికించలేని నిస్సహాయ స్థితిలో వున్నాడు. తాము శత్రువులతో ముఖాముఖీ తలపడి, గెలిచేదాకా శ్రీలేఖను వారు కన్యగా వుంచుతారన్న నమ్మకం లేదు! రహస్యంగా ఈపాటికే చంపక రాకుమారుడితో వివాహం జరిపించేసినా ఆశ్చర్యం లేదు!

శ్రీదత్త, విజయదత్తులిద్దరి మధ్య కొద్దిసేపు నిశ్శబ్దం తాండవించింది.

చివరకు తన ఆలోచనలనుంచి తేరుకున్న విజయదత్తుడు గంభీరంగా "చెప్పండి నాన్నగారూ!" అన్నాడు.

-(ఇంకావుంది)



స్వాతంత్ర్య స్వర్ణోత్సవ సంవత్సర చందమామ కానుక!

# ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం



దేశ వ్యాప్తంగా అక్కడక్కడా తిరుగుబాటు జ్వాల ప్రజ్వరిల్లింది. తిరుగుబాటుకు ప్రధానంగా రాణీ లక్ష్మీబాయి, నానా సాహెబ్ నాయకత్వం వహించారు. రాజు మరణానంతరం ఝాన్సీ రాజ్యాన్ని, ఆక్రమించుకోవడానికి బ్రిటిష్ కంపెనీ ప్రయత్నించింది. కాని రాణీ లక్ష్మీబాయి ఎదురుతిరిగి బ్రిటిష్ సేనలను ప్రతిఘటించి పోరాడింది. అయితే, కోటను, రక్షించుకోలేని సంకట స్థితి ఎదురుకావడంతో మిత్రుల సలహా ప్రకారం, దత్త పుత్రుడైన శిశువును వీపుకు కట్టుకుని గుర్రం మీద కోటనుంచి తప్పించుకున్నది.

-తరవాత

మందర్, కాశి అనే ఇద్దరు విశ్వాస పాత్రులైన వీరవనితలు ఇరువైపులా వెంటరాగా, పురుషవేషం ధరించిన రాణీ లక్ష్మీబాయి, గుర్రం మీద శరవేగంతో ముందుకు సాగింది. సాహసవంతులైన కొందరు సైనికులు వారిని అనుసరించి వెళ్ళారు.

ఒక రోజంతా ఎక్కడా ఆగకుండా ప్రయాణం చేసి మరునాడు అర్ధరాత్రి సమయానికి రాణి, కల్పి రాజభవనాన్ని సమీపించింది. భవనం ముందు కాగడాలు పట్టుకుని నిలబడివున్న కాపలాభటులు ఆమెను చూడగానే, "రాణిగారు వచ్చారు!" ఝాన్సీరాణిగారు వచ్చారు! అంటూ లోపలికి వెళ్ళారు. కొంత సేపటికి నానా సాహెబ్ సోదరుడు రావుసాహెబ్ భవనం వెలుపలికి వచ్చి ఆమెకు సాదరంగా స్వాగతం పలికాడు. రాణి గుర్రంపైనుంచి దిగగానే, కొందరు పరిచారికలు వచ్చి జోలెలో నిదురిస్తున్న ఆమె శిశువును తీసుకుని లోపలికి వెళ్ళారు. గుర్రాన్ని లోపలికి తీసుకువెళ్ళడానికి కొందరు సైనికులు ముందుకు వచ్చారు.తన కర్తవ్యం నిర్వహించిన ఆ గుర్రం నేలపైబడి ప్రాణం వదిలింది. రాణి వంగి గుర్రాన్ని కృతజ్ఞతతో స్పృశించింది. ఆమె కళ్ళనుంచి బాష్పాలు రాలాయి. ఆమె



మౌనంగా లేచి, తదుపరి కర్తవ్యం గురించి, రావు సాహెబ్‌తో చర్చించడానికి భవనం లోపలికి నడిచింది.

రాణి అక్కడికి చేరడానికి ఒకరోజు ముందుగానే-ఝాన్సీలో బ్రిటిష్ కంపెనీ సైనికులు జరిపిన ఉచకోత గురించీ, సర్ హగ్ రోజ్ నాయకత్వంలో సగం మంది సైనికులు ఝాన్సీ నుంచి కల్పికేసి రానున్న విషయం గురించీ రాణిగారి గూఢచారులు నానాసాహెబ్‌కు తెలియజేశారు.

నలుగురు రాజులూ, మరికొందరు జమీందార్లూ తమవద్ద ఉంచిన సేనలను రావు సాహెబ్, తాంతియా తోపే నిమిషాలలో ఒకచోట సమీకరించారు. భారత సేనలు బ్రిటిష్ సేనలను ఎదుర్కోవడానికి తాంతియాతోపే నాయకత్వంలో బయలుదేరాయి. కుంద్‌గాంవ్ వద్ద ఇరు సేనల మధ్య యుద్ధం జరిగింది. దురదృష్టవశాత్తు స్థానిక సైనికులందరినీ, క్రమశిక్షణతో ఒకచోట సమీకరించడానికి తాంతియా తోపేకు చాలినంత సమయం లేక పోయింది. కొన్ని గంటల పాటు యుద్ధం చేశాక వెనక్కు మళ్ళవలసి వచ్చింది. హగ్‌రోజ్‌సైనికులు విజయోత్సాహంతో కల్పి పట్టణంపై పడిదోచుకున్నారు. రావు సాహెబ్ తనసొంత కర్మాగారంలో తయారు చేసిన తుపాకులనూ, మందుగుండు సామగ్రినీ వశపరచుకున్నారు. అయినా, రాణీ లక్ష్మీబాయినిగాని, తాంతియాతోపేనుగాని పట్టుకోలేకపోయారు. ఆ ముగ్గురు నాయకులూ సేనలను సమీకరించుకుంటూ గ్వాలియర్ కేసి బయలుదేరారు.

గ్వాలియర్ పాలకుడు సింధియా బ్రిటిష్ కంపెనీతో చేతులు కలిపినప్పటికీ, గ్వాలియర్ పురప్రముఖులూ, సామాన్యప్రజలూ తిరుగుబాటుదారుల పట్ల గౌరవాదరాలు కలిగి వుండేవారు.

తిరుగుబాటు నాయకులు సేనలతో గ్వాలియర్‌ను సమీపిస్తున్నారని తెలియగానే రాజాసింధియా నగరాన్ని వదిలి పారిపోయాడు. లక్ష్మీబాయికీ, ఆమె అనుచరులకూ నగరప్రజలు ఘనస్వాగతం పలికారు!

ఈ హఠాత్ పరిణామాన్ని హగ్‌రోజ్ తీరని అవమానంగా భావించాడు. గ్వాలియర్‌ను మళ్ళీ సింధియాకు

అప్పగించడంలో విఫలమయినట్టయితే- మిగిలిన స్థానిక పాలకులందరరూ ఈస్టిండియా కంపెనీ శక్తి సామర్థ్యాల పట్ల విశ్వాసం కోల్పోయే ప్రమాదం ఉంది. అప్పటికే ఝాన్సీ పూర్తిగా తన వశంలో ఉన్నది. అందువల్ల సైనికదళాలు పూర్తి స్థాయిలో అక్కడ ఉండవలసిన అవసరం లేకపోయింది. కాబట్టి అక్కడినుంచి నగం సైనికదళాలను గ్వాలియర్‌కేసి నడిపించాడు. సైన్యానికి అగ్రభాగంలో సింథియాను నిలిపాడు. ఈ ఎత్తుగడ బ్రిటిష్ సేనలకు ఎంతగానో ఉపకరించింది. గ్వాలియర్ ప్రజలు— పరాయిపాలకులు తమ సంస్థానాన్ని వదిలిపెట్టిపోవాలనీ అందుకు పోరాడుతవాన్న తిరుగుబాటు నాయకులపట్ల అమితగౌరవాదరాలు కలిగి ఉన్నారు. అయినప్పటికీ, వంశపారంపర్యంగా తమను పరిపాలిస్తున్న సింథియా రాజకుటుంబం పట్ల వాళ్ళకున్న భక్తి ప్రపత్తులు కూడా తక్కువేంకావు. అందువల్ల తమ రాజు కొమ్ముకాస్తూన్న పరాయి పాలకులను ఎదిరించడమే అవుతుంది, అని భావించి వాళ్ళు తటస్థంగా ఉండిపోయారు!

రాణీ లక్ష్మీబాయి దృఢ చిత్తంతో, మొక్కవోని ధైర్యసాహసాలతో బ్రిటిష్ సేనలను ఎదుర్కొన్నది. ఆమె అధిరోహించింది కొత్త గుర్రం కావడంతో అది ఆమె ఆజ్ఞలను, భావాలను



అంతసులభంగా అర్థం చేసుకోలేక పోయింది. కంపెనీ సేనలను నడిపిస్తూన్న సర్ హగ్‌రోజ్ యుద్ధవిద్యలో ప్రతిభావంతుడూ, అనుభవజ్ఞుడూ అయిన సేనానాయకుడు. దళ నాయకులు అనేక యుద్ధాలు చేసి యుద్ధకళలో ఆరితేరినవాళ్ళు. సైనికులు సక్రమమైన శిక్షణ పొందిన వాళ్ళు. ఇటువంటి బలమైన శత్రువులను- పట్టుమని ఇరవైయేళ్ళు కూడా నిండీ నిండని రాణీలక్ష్మీబాయి అపూర్వమైన ధైర్యసాహసాలు ప్రదర్శిస్తూ; పట్టుదల ఊపిరిగా, దేశభక్తి తోడుగా చీల్చిచెండాడసాగింది.

రాణిగారి సైనికులు అనవమాన ధైర్యసాహసాలూ, దేశభక్తీ కలిగిన వాళ్ళేగాని సరైన శిక్షణ పొందిన వాళ్ళు కారు. ఆ కారణంగా సుశిక్షితులైన



శత్రు సేనల వ్యూహాత్మకమైన తాకిడిని సమర్థవంతంగా ఎదుర్కోలేకపోయారు. వందలాది మంది ప్రాణాలర్పించారు. గ్వాలియర్ రాజు అండ ఉన్నట్టయితే రాణికి ఈ దుస్థితి ఏర్పడి ఉండేది కాదు!

మధ్యాహ్నం అయ్యేసరికి రాణి పక్షంలోని సైన్యం బాగా తరిగి పోయింది. కొందరు దళనాయకులు ఆమెతో, "మహారాణీ! తమరు ఇంకా ఇలా ఒంటరి పోరాటం సాగించడం క్షేమంకాదు. దేశప్రజలకు తమ ప్రాణం అమూల్యమైనది. ప్రాణాలతో ఉంటే మళ్ళీ పోరాటం సాగించవచ్చు. తమరువెంటనే సురక్షిత ప్రాంతం చేరుకోవాలి!" అన్నారు.

రాణి వాళ్ళ మాటలను గౌరవించి, అందులోని నిజాన్ని గ్రహించి-మందర్, కాశీలతో పాటు మరి కొందరు భటులు వెంటరాగా యుద్ధభూమి నుంచి బయట పడింది.

శత్రు సైనికులు వేటకుక్కల్లా ఆమె వెంట పడ్డారు. ఆమెను హతమార్చినా, ప్రాణాలతో పట్టుకున్నా తమ యజమానుల నుంచి గొప్పబహుమతులు లభిస్తాయని వాళ్ళకు తెలుసు.

రాణి నాలుగు బాటల కూడలి చేరి, అక్కడినుంచి చప్పున ఒక ఇరుకు సందులోకి తిరిగింది. ఆమె ఎటు వెళ్ళిందో అంతుబట్టని శత్రుసైనికులు నాలుగు జట్లుగా విడిపోయి నాలుగు వైపులకూ వెళ్ళారు.

కొంత దూరంలో రాణికి ఒక వాగు ఎదురయ్యింది. నీళ్ళను చూడగానే కొత్త గుర్రం బెదిరిపోయి ఎంత అదిలించినప్పటికీ ముందుకు వెళ్ళకుండా అటూ ఇటూ తిరగసాగింది. అంతలో అటుకేసి వచ్చిన శత్రుసైనికులు రాణిగారి అనుచరుల మీద కాల్పులు జరిపారు. మందర్ గాయపడింది.

ఆసరికే వాగు సగం దాటిన రాణి, మందర్ అరుపు విని వెనుదిరిగివచ్చి, ఆమెను గాయపరచిన వాడి తలను తెగనరికింది. వాడు గుర్రం పైనుంచి కిందపడి చచ్చాడు. రాణి గుర్రం పైనుంచి కిందికి దూకి ప్రాణాలతో కొట్టుమిట్టాడుతున్న మందర్‌ను ఒడిలోకి తీసుకోబోయింది. అంతలో ఒక దుర్మార్గుడు రాణి తలను గురిపెట్టి కత్తి విసిరాడు. కత్తి తగలగానే రాణి తల నుంచి నెత్తురు కారనారంభించింది. కత్తి విసిరిన వాడి తలను తెగ నరికిన రాణి అంగరక్షకులు, ఆమెను సమీపంలోని ఒక గుడిసెలోకి తీసుకు వెళ్ళారు.

''బిడ్డలారా! ప్రాణం పోయిన మరుక్షణమే నాదేహాన్ని దహనం చేసెయ్యండి. ఆదుర్మార్గులు నాశరీరాన్ని చూడకూడదు!'' అంటూ ప్రాణాలు విడిచింది రాణి. భటులు మరుక్షణమే అక్కడ దొరికిన కట్టెలు, ఎండుటాకులతో చితి పేర్చి రాణి భౌతిక కాయానికి దహన సంస్కారం చేశారు.

సాహసమే ఊపిరిగా పోరాడిన రాణీ లక్ష్మీబాయి జీవితం ముగిసింది. ఆమెవ్యక్తిత్వం మహత్తరమైనది. ప్రపంచ చరిత్రలో ఒక్క జోన్ ఆఫ్ ఆర్క్‌ను మాత్రమే ఆమెతో పోల్చగలం. ఆమెను గురించి జవహర్‌లాల్ నెహ్రూ ఇలా అన్నారు: ''ఝాన్సీలక్ష్మీబాయి పేరు ప్రజాహృదయాలలో చిరస్థాయిగా నిలిచిపోయి, జోహారులందుకుంటోంది. ఇరవైయేళ్ళ ప్రాయంలో ఆ యువతి పోరాడుతూ ప్రాణ త్యాగం చేసింది. 'తిరుగుబాటుకు నాయకత్వం వహించిన వారిలో సర్వోత్కృష్టమైన వ్యక్తి ఆమె', అని ఆమెను వ్యతిరేకించిన సేనానాయకుడు సైతం మెచ్చుకున్నాడు!''

తిరుగుబాటు వీరులు పలువురు యుద్ధం చేస్తూ, మరెందరో మరణ శిక్షలకు లోనై ప్రాణాలర్పించారు. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం అంతమయింది.





# ధనానికి ధనసహాయం

ఒకానొక కాలంలో ఒక రాజు ఇంటి ముందుకు ఒక బైరాగి వచ్చి, "నాకు తెలివి అయితే ఉన్నది గాని దాన్ని ఉపయోగించుకునే వాళ్ళు ఎక్కడా కనిపించటం లేదు. దాన్ని నేనూ ఉపయోగించుకోలేను, ఏం చేస్తాం?" అని గట్టిగా అని వెళ్ళిపోతూ ఉండేవాడు.

రాజు ఒకనాడు బైరాగిని పిలిచి, "నువ్వు రోజూ అనే ఈ మాటలకు అర్థమేమిటి?" అని అడిగాడు.

"రాజా, ఓపిక వహించి, నన్ను నమ్మి, నాకు కావలసినంత డబ్బు ఇస్తే, నీ ఖజానా నింపుతాను. నేను పుచ్చుకున్న ధనానికి పదింతలు లాభం వస్తుంది," అన్నాడు బైరాగి.

బైరాగి కోరినంత ధనం ఇయ్యటానికి రాజు ఒప్పుకున్నాడు. కాని మంత్రి రాజుతో రహస్యంగా, "ఇందులో ఏదైనా మోసం ఉండవచ్చు. బైరాగులను నమ్మరాదు," అన్నాడు. అయినా రాజు ఆ బైరాగికి అడిగినంత ధనం ఇచ్చి పంపేశాడు.

ఒక సంవత్సరం తరవాత ఆ బైరాగి తిరిగివచ్చి, "జ్ఞాపకం ఉన్నానా, మహారాజా? నా ఆలోచన అమలు చేస్తున్నాను, మరి కొంత ధనం కావాలి," అన్నాడు.

మంత్రి అడ్డు చెప్పినప్పటికీ, రాజు బైరాగికి రెండోసారి ధనం ఇచ్చి పంపేశాడు.

మరొక సంవత్సరం గడిచింది. ఆ బైరాగి మళ్ళీ వచ్చి, "నేను చేస్తున్న పని చివరి ఘట్టంలో ఉన్నది. ధనం తక్కువయింది. అందుకే వచ్చాను మహారాజా!" అన్నాడు రాజుతో.

వద్దన్న మంత్రిని రాజు శాంతపరచి, బైరాగి కోరిన ధనం ఇచ్చి పంపేశాడు.

మరొక సంవత్సరం గడిచింది. బైరాగి మళ్ళీ వచ్చాడు.

25-ఏళ్ళనాటి చందమామ కథ

"ఇంకా ధనం కావాలా?" అని రాజు బైరాగిని అడిగాడు.

"మీ ఓపికకు ధన్యవాదాలు. పని పూర్తి అయింది. మీరిద్దరూ నా వెంట రండి," అన్నాడు బైరాగి.

రాజు బైరాగి వెంట బయలుదేరటానికి సిద్ధపడుతూ ఉంటడం చూసి మంత్రి, "మన ఇద్దరినే రమ్మంటున్నాడు బైరాగి. ఎక్కడికో, ఎందుకో తెలియకుండా, ఈ బైరాగిని గుడ్డిగా నమ్మి ఇతని వెంట వెళ్ళటం మంచిది కాదు," అన్నాడు.

"నమ్మటానికీ, ఓపిక పట్టటానికీ ముందు ఒప్పుకున్నాను కదా మంత్రీ? అవసరమైతే నన్ను నేను రక్షించుకోలే ననుకుంటున్నావా?" అన్నాడు రాజు.

"మంత్రిగారు భయపడుతున్నట్టయితే ఇద్దరు అంగరక్షకులను వెంట తీసుకు రండి," అన్నాడు బైరాగి.

"ఏమీ వద్దు. పోదాం పద," అన్నాడు రాజు. మంత్రి మాత్రం అంగరక్షకులు రహస్యంగా తమను వెన్నాడి వచ్చేటట్టు ఏర్పాటు చేశాడు.

బైరాగి వాళ్ళను నగరం దాటించి, కొండ దాటించి, అరణ్యం దాటించి, సముద్ర తీరానికి తీసుకుపోయాడు. అక్కడ ఒక చిన్న పడవ ఉన్నది. బైరాగీ, రాజూ, మంత్రీ అందులో ఎక్కారు. వీరికీ, ఇద్దరు పడవ వాళ్ళకు మటుకే ఆ పడవలో చోటున్నది.

పడవ పోయి పోయి ఒక చిన్న దీవి చేరింది. ఆ ద్వీపం నిండా మడమల లోతు బూడిద ఉన్నది. బూడిదకు ఎగువగా కొంగలు మందలు మందలుగా



ఎగురుతున్నాయి. బూడిద కుప్ప మధ్యగా ఒక కాలిబాట ఉన్నది.

"ఇదేం దీవి? ఏదో మంత్రాల దీవి లాగున్నదే? మిమ్మల్ని ఎక్కడికి తీసుకు పోతున్నావు?" అంటూ మంత్రి కత్తి దూశాడు.

"తొందరపడకండి. ఇది చిన్న దీవి. ఎక్కువమంది వస్తే బూడిద చెదిరి పోతుంది. కొంగలు బెదిరిపోతాయి. అందుకే రక్షక భటులను రావద్దన్నాను," అన్నాడు బైరాగి.

బైరాగి ఒక చోట ఆగి, అక్కడ ఉన్న ఇనుప తలుపును ఎత్తాడు. దిగువకు మెట్లు ఉన్నాయి. ఆ మెట్లు దిగి వెళ్ళి అడుగున ఏమున్నదో చూసి రమ్మని బైరాగి రాజుతో అన్నాడు. రాజు తిరిగి వచ్చే దాకా మంత్రి బైరాగిని పట్టుకుని ఉన్నాడు.

రాజు భూగృహంలోకి దిగి ముత్యాల రాసులు చూశాడు. ఆయన పైకి వచ్చి, మంత్రిని కూడా వెళ్ళి చూసి రమ్మన్నాడు.

మంత్రి వెళ్ళి చూసి వచ్చి, బైరాగికి క్షమాపణ చెప్పుకున్నాడు.

రాజు బైరాగిని "ఏమిటి ఇదంతా?" అని అడిగాడు.

దానికి బైరాగి ఇలా చెప్పాడు:

"నేను సదానందుడనే వర్తకుణ్ణి. నేను వర్తకం చేస్తూ ఈ దీవి రహస్యం ఒకటి తెలుసుకున్నాను. ఈ దీవి చుట్టూ బండలున్నాయి. సముద్రానికి పోటు వచ్చినప్పుడు ఆ బండలు బయటపడతాయి. ఆ బండల మీద అంతులేని ముత్యపు చిప్పలు ఉన్నాయి. కొంగలు ముత్యపు చిప్పలలోని మాంసం కోసరం వాటిని ఎత్తుకు వచ్చి దీవి పైన వాలుతాయి. ఆ ముత్యపు చిప్పలలో అంతులేని ముత్యాలు ఉంటాయి. ఆ తరగని ధనాన్ని నేను సంగ్రహించే ప్రయత్నం చేసే లోపల నా భార్యా బిడ్డలూ మరణించారు. నాకు జీవితం మీద విరక్తి కలిగి బైరాగిని అయిపోయాను. కాని ఈ దీవిలోని ముత్యాల ఆలోచన నన్ను వదలలేదు. ఆ ఆలోచన పోతేగాని నాకు వైరాగ్యం పూర్తిగా కుదిరేటట్టు కనిపించలేదు. అందుకే మీ సహాయం కోరాను. మీరిచ్చిన డబ్బుతో ఒక భూగృహం తవ్వించాను; దీవి అంతటా దట్టంగా బూడిద చల్లించాను. ఆ బూడిదలో కూరుకు పోయిన ముత్యపు చిప్పలను కొంగలు చూడలేవు? మళ్ళీ వెళ్ళి ముత్యపు చిప్పలను తెస్తాయి. తరవాత పడవనూ, మనుషులనూ ఏర్పాటు చేసి, ముత్యపు చిప్పల నుంచి ముత్యాలు తీయించి, భూగృహంలో పోశాను. వేసి చూపితేగాని మీరు నమ్మరని ఈ విషయం మీ దగ్గర రహస్యంగా ఉంచాను. నేను తలపెట్టిన పని ముగిసింది. ఇకనుంచీ ముత్యాలను మీరే పోగు చేసుకోవచ్చు. ఇక నాకు జీవితం మీద ఏ మమకారమూ లేదు. నేను పోయి నిశ్చింతగా తపన్సు చేసుకుంటాను. మీరూ, మీ ప్రజలూ సుఖంగా ఉండండి!"

ఇలా చెప్పి బైరాగి తన దారిన తాను వెళ్ళిపోయాడు.



# కావేరీతీర ప్రయాణం-3

# టిప్పు రాజ్యంలో


•రచన: జయంతి మహాలింగం

•చిత్రాలు: గౌతమ్‌సేన్





కృష్ణరాజసాగర్ నుంచి దాదాపు ముప్పైయేడు కి.మీ. దూరం ఆగ్నేయ దిశగా ప్రవహించాక కావేరీ నది రెండు పాయలుగా చీలుతుంది. ఈ నది ప్రయాణ మార్గంలో ఏర్పడిన ముఖ్యమైన మూడు ద్వీపాలలో మొదటి ద్వీపమైన శ్రీరంగపట్నం 5 కి.మీ. పొడవు; 2 కి.మీ వెడల్పు కలిగి ఉన్నది. మూడు దీవులలోనూ శ్రీరంగనాథస్వామి దేవాలయాలు ఉన్నాయి. శ్రీరంగపట్నంలోని దేవాలయం మొట్ట మొదటిది కాబట్టి దీనిని 'ఆదిరంగ' అని అంటారు.

ఈ దీవి కీలకమైన స్థానంలో ఉన్నది. 18వ శతాబ్దంలో హైదర్ అలీ, తరవాత ఆయన కుమారుడు టిప్పు సుల్తాన్ దీనిని పట్టుకునేంత వరకు ఎంతో ప్రాముఖ్యతను సంతరించుకున్నది.

శ్రీరంగపట్నంలో ప్రధానంగా కనిపించే కోట విజయనగర రాజుల పరిపాలనా కాలంలో 1454వ సం॥లో నిర్మించబడింది. ఇది 5 కి.మీ. వైశాల్యంలో విస్తరించి ఉన్నది. దీనినే ఒక నగరంగా చెప్పవచ్చు. ప్రస్తుతం నగర జనాభా 20,000. 4,500 మీ॥ పొడవైన కోటకు నాలుగు ప్రధాన ద్వారాలు ఉన్నాయి. బెంగుళూరు, మైసూరు, ఢిల్లీ, జలద్వారాలు అని వాటిని పిలుస్తారు. మూడు ప్రహరీ గోడలూ, మూడు అగడ్తలూ ఉన్నాయి. శిథిలావస్థలో ఉన్నప్పటికీ కోట ఎంతో గంభీరంగా ఉన్నది. ఈ కోటలో రంగనాథ ఆలయం; టిప్పు నిర్మించిన మసీదు, (ప్రస్తుతం శిథిలావస్థలో వున్న) లాల్ మహల్; టిప్పు యుద్ధ ఖైదీలను వుంచిన బంధిఖానాలూ ఉన్నాయి.

స్వాతంత్ర్యాన్ని ప్రధానంగా భావించిన షేర్-ఇ-మైసూర్ టిప్పు సుల్తాన్ గొప్ప వ్యక్తిత్వం కలిగిన పాలకుడు. అయితే కొందరు చరిత్రకారులు, ముఖ్యంగా బ్రిటిష్ చరిత్రకారులు టిప్పూను దురభిమానిగానూ, ప్రజాపీడకుడిగానూ చిత్రించారు. ఇది పక్షపాతంతో, అతిశయోక్తితో నిండిన



టిప్పుసుల్తాన్
శ్రీరంగపట్నం కోట



గుంబజ్




అంచనా అని చెప్పాలి. శృంగేరి శంకరాచార్యులు టిప్పు సహాయాన్ని అర్థించినప్పుడు, ఆయన కల్పించుకుని ఆచార్యుల ఆస్తిపాస్తులను కాపాడి ఇచ్చాడు. హైదర్, టిప్పు ఇరువురూ కూడా హిందూ దేవాలయాలకు ఉదారంగా విరాళాలిచ్చారు. వాళ్ళు సమర్పించిన వెండి పాత్రలు శ్రీరంగనాథ ఆలయంలో ఇంకా ఉన్నాయి. వాళ్ళు యుద్ధానికి బయలుదేరే ముందు రంగనాథ మందిరంలో ప్రార్థనలు జరిపి మరీ వెళ్ళేవారని చెబుతారు.

1799వ సం॥లో జరిగిన నాలుగవ ఆఖరి ఆంగ్లో-మైసూర్ యుద్ధ సమయంలో — శ్రీరంగ పట్నం కోట ఆఖరి పెద్ద ముట్టడిని అనుభవించింది. అయినా, అప్పుడు టిప్పు బ్రిటిష్ వాళ్ళను ఎదుర్కోలేకపోయాడు. ఆయన ఆఖరి పోరాటం పాత భవనం వద్ద అంటే, కావేరికి ఎదురుగా వున్న జలద్వారం వద్ద జరిగింది. టిప్పు క్షతగాత్రుడై కిందపడి సగం స్పృహతో, రెండు గోడల మధ్య వున్న ఇరుకైన మార్గంలో కోటకేసి పాక్కుంటూ వెళ్ళాడు. కాని ద్రోహి అయిన మీర్ సాధిక్ అనే అధికారి ఆ ద్వారాన్ని కూడా మూసివేశాడు. టిప్పు తలలో శత్రువుల తుపాకీ తూటాలు దూసుకుపోయాయి. సుల్తాన్ పడిపోయిన చోట చలువరాళ్ళు పాదగబడి వున్నాయి.

శ్రీరంగపట్నంలో టిప్పు సుల్తాన్ నిర్మించిన భవనాలలో మసీదు, దార్యా దౌలత్ బాగ్, గుంబజ్ అనే మూడు చాలా ముఖ్యమైనవి. 1787వ సం॥లో నిర్మించబడిన మసీదులో 250 మెట్లు వృత్తాకారంలో వెళ్ళి ఎత్తయిన మీనార్ల మీదికి చేరుతాయి. అక్కడి నుంచి చుట్టుపక్కల ప్రాంతాలను చూడవచ్చు. దార్యా దౌలత్ బాగ్ అంటే

– సముద్ర సంపద ఉద్యానం అని అర్థం. ఇది కోటకు వెలుపల ఉన్నది. ఇది టిప్పు వేసవి విడిదిగా ఉండేది. టిప్పు చేసిన యుద్ధ దృశ్యాలు గోడల పైన రంగు రంగుల కుడ్య చిత్రాలుగా చిత్రించబడి వున్నాయి. ఇప్పుడు ఇక్కడ ఒక మ్యూజియం రూపొందించబడింది. పట్టణానికి ఆగ్నేయ దిశగా గుంబజ్ ఉన్నది. టిప్పూ, ఆయన తల్లితండ్రుల భౌతికకాయాలను పాతిపెట్టిన స్మారక మందిరాలు ఇందులో ఉన్నాయి. తమాల వృక్షాల మధ్య నల్లటి రాతి స్తంభాలతో, లోపల అమర్చిన దంతపు తలుపులతో వున్న చాలా అద్భుత భవనం ఇది.

కోట లోపల వున్న రంగనాథస్వామి ఆలయం బహుశా ఒక్కసారిగా కాకుండా దశలవారీగా నిర్మించబడి వుండవచ్చని చెబుతారు. శేష శయనం మీద పవళించిన రంగనాథస్వామి విగ్రహం 4.5 మీ।। పొడవు ఉన్నది. ఏడు తలల శేషుడు పడగలతో గొడుగు పట్టే భంగిమలో ఉన్నది. భక్తులు గర్భగృహం వెలుపలి నుంచే దేవుణ్ణి దర్శించుకోవాలి. గౌతమ ముని, కావేరీ మాత చిన్న ప్రతిమలు రంగనాథస్వామి పాదాల చెంత ఉన్నాయి.

ద్వీపానికి తూర్పు వైపున కోటకు ఆవల టిప్పు సుల్తాన్ అధీనంలోని గంజాం పొలిమేరలు ఉన్నాయి. ఒకప్పుడా ప్రాంతం అత్తి చెట్లకూ, చేనేత, కాగితం పరిశ్రమలకూ, ప్రసిద్ధిగాంచింది. 18వ శతాబ్దంలో ఫ్రెంచ్ మిషనరీ అబే డుబోయిస్ నిర్మించిన కేథలిక్ చర్చ్ ఒకటి ఇక్కడ ఉన్నది.

శ్రీరంగ పట్నానికి 4 కి.మీ. దూరంలో వున్న మరొక కావేరీ ద్వీపం సుప్రసిద్ధమైన రంగనథిట్టు పక్షుల శరణాలయం. జూన్ – డిసెంబర్ నెలల మధ్య రంగనథిట్టు దీవి

**రంగనాథస్వామి ఆలయం**



మీది ఆకాశం రకరకాల పక్షుల ఆగమనంతో రంగురంగులుగా మారిపోతుంది. 1940వ సం॥ లో దీనిని ప్రభుత్వం రక్షిత పక్షుల శరణాలయంగా ప్రకటించింది. నారాయణ పక్షులు, తెడ్డుమూతి కొంగలు, ఎర్రకాళ్ళ కొంగలు, లకుముకి పిట్టలు, సంకుబుడ్డ కొంగలు మొదలైన రకరకాల పక్షులు ఈ దీవిని వెతుక్కుంటూ వస్తాయి. దీవి మధ్యగా అమర్చిన ఎత్తయిన మంచెపై పర్యాటకులు పక్షులను పరిశీలించి చూస్తారు.

కావేరీ నది అక్కడి నుంచి 25 కి.మీ. ముందుకు వెళ్ళి సోమనాథపుర అనే గ్రామం దగ్గర దక్షిణాభిముఖంగా తిరుగుతుంది. ఇక్కడున్న ఆలయం హొయసాల శిల్పానికి చక్కని తార్కాణం. హలబీడు, బేలూరు దేవాలయాల కన్నా ఇది ఎంతో జాగ్రత్తగా సంరక్షించబడుతున్నది. హొయసాల రాజు మూడవ నరసింహ వద్ద దండనాయకుడుగా పనిచేసిన సోమనాధుడు 1258వ సం॥లో, హొయసాలులకే ప్రత్యేకమైన నక్షత్రాకార రూపంలో ఈ కేశవాలయం నిర్మించాడు. ఆలయం వెలుపల రామాయణ, మహాభారత గాథల ప్రధాన ఘట్టాలు శిల్పాలుగా చెక్కబడి ఉన్నాయి. గర్భ గృహంలో 194 దైవరూపాలు శిల్పాలుగా మలచబడి వున్నాయి. ప్రధాన ఆలయం ఖాళీగా ఉన్నది. ఒకప్పుడు అక్కడ వున్న కేశవ స్వామి విగ్రహం ఇప్పుడు లేదు. మామూలుగా మన దేశంలో దేవాలయాలు నిర్మించినవాళ్ళ పేర్లూ, శిల్పుల పేర్లూ గుప్తంగా ఎవరికీ తెలియకుండా వుంటాయి. అయితే ఇందుకు భిన్నంగా సోమనాధపుర ఆలయ ప్రహరీ గోడల మీద శిల్పుల సంతకాలు ఉండడం విశేషం. ఈ ఆలయ నిర్మాణానికి నిధులను సమకూర్చిన దాతల పేర్లు కూడా ఒక శిలాఫలకం మీద చెక్కబడి వున్నాయి. సోమనాధుడు ఈ ప్రాంతంలోనే ఇంకా నాలుగు ఆలయాలు నిర్మించాడని చెబుతారు. అయితే పంచలింగేశ్వర, లక్ష్మీనృసింహ ఆలయాలు రెండు మాత్రమే కాల ప్రవాహానికి ఎదురొడ్డి ఈనాటికీ నిలిచి ఉన్నాయి. అవి కూడా శిథిలావస్థలో ఉన్నాయి. వీటి పరిరక్షణకు ప్రభుత్వం సత్వర చర్యలు చేపట్టకపోతే ఈ అందమైన కేశవస్వామి ఆలయానికి కూడా మిగిలిన ఆలయాలకు పట్టిన గతే పట్టవచ్చు!



**సోమనాధపుర ఆలయం**



# సగం దీవెన - సగం శాపం

విదేహదేశంలోని కోదండపురం అనే గ్రామంలో కోదండ సెట్టి అనే వర్తకుడుండేవాడు. ఆయన న్యాయపద్ధతిలో వ్యాపారం చేస్తూ, అందరిచేతా గౌరవింపబడుతూ లోటు లేకుండా జీవిస్తున్నాడు. ఆయనకు అరుణ అనే చక్కని చుక్కలాంటి కూతురున్నది. కోదండసెట్టికి మగసంతానం లేకపోవడం చేత, అరుణను తన చెల్లెలి కొడుకైన వినయశీలికిచ్చి పెళ్ళి చేసి, ఇల్లరికం ఉంచుకోవాలని నిర్ణయించుకున్నాడు. తన మనసులోని ఆలోచనను బయటపెడుతూ, రాజధానిలో వర్తకం చేసుకుంటున్న బావమరిదికి, ఆంతరంగికుల ద్వారా వర్తమానం పంపాడు.

ఇది చూసి కోదండసెటి చెల్లెలు పరమానందపడింది. ఆ సమయానికి వాళ్ళ వ్యాపార పరిస్థితి సరిగాలేనందున, కొడుకు వినయశీలిని కుంతల ద్వీపానికి పంపాలన్న ప్రయత్నంలో వున్నారు. అందువల్ల, ఆమె భర్తతో, "వ్యాపారంలో నష్టం వచ్చి పీకల దాకా అప్పుల ఊబిలో కూరుకుపోయిన మన సంగతి, అన్నకు తెలియదు. ఇక్కడ పోటీకి తట్టుకోలేక, అబ్బాయిని కుంతల ద్వీపానికి వ్యాపారం కోసం పంపేందుకు రాజానుమతి కూడా పొందావు. అబ్బాయిని అక్కడికి పంపి, అనుక్షణం బెంగపడేకన్న, అన్నగారింటికి ఇల్లరికం పంపడమే మంచిదిగా నాకు తోస్తున్నది. అన్న ఇచ్చే కట్నంతో మన అప్పులు తీర్చుకుని హాయిగా వుండవచ్చు. దైవం అనుకూలించి వేలు చేస్తే, మళ్ళీ వ్యాపారంలో మనకు మంచి రోజులు రాకపోవు!" అన్నది.

అక్కడే వున్న వినయశీలి, తల్లితో "అమ్మా, నీ పుట్టింటి అభిమానం నిన్నిలా మాట్లాడించింది. మామయ్య కూతుర్ని

జె. ఉదయనాగ శిరీష

చేసుకోనని నేనడం లేదు. వ్యాపారంలో లాభనష్టాలు సహజం. కుంతల దీవిలో సంపన్నులెక్కువ. మన సరకులకక్కడ రెట్టింపు ధర పలుకుతుంది. అంతేకాదు, అక్కడ బంగారం చాలా చవక. వ్యాపారంలో డబ్బు కూడబెట్టి, రెండు సంవత్సరాలలో తిరిగి వస్తాను. నిన్ననే కుంతల దీవి మహారాజు వద్ద నుంచి కూడా, వాళ్ళ దేశంలో నేను నివాసం వుండడానికి అధికార పత్రం వచ్చింది. మన వ్యాపారం నష్టంలో వున్న సంగతి, అయినవాళ్ళకు తెలియనీయడం నాకిష్టం లేదు. నామీద నమ్మకం ఉంచి రెండు సంవత్సరాలు ఓపిక పట్టు," అన్నాడు.

వినయశీలి మాటలకు, తండ్రి సంతోషించి, "వ్యాపారగుణం మన వంశంలో పుట్టుకతోనే వస్తుంది. నష్టం వచ్చినందుకు కుంగిపోయే మనస్తత్వం నాకు లేదు. నువ్వొకసారి కోదండపురం వెళ్ళి రావడం వ్యాపారిగా నాకు, మేనమామను కలుసుకుని మాట్లాడడం మీ అమ్మకు సంతోషం కలిగిస్తుంది." అన్నాడు.

తండ్రి మాట కాదనలేక, వినయశీలి కోదండపురం వెళ్ళాడు. మేనల్లుణ్ణి చూసి చాలా సంతోషించిన కోదండసెట్టి, అతడి కుంతలదీవి ప్రయాణం విని, "అంతా నీ ఇష్టం. అయినా, సముద్ర ప్రయాణం చేసి, ఆ దీవిలో నువ్వు వ్యాపారం ప్రారంభించడం, నాకు కొంత ఆందోళన కలిగిస్తున్నది. కానీ నీలోని పట్టుదల చూశాక, ఒక వ్యాపారిగా నిన్ను ఆపడం న్యాయం కాదనిపిస్తున్నది. నీ వ్యాపార దక్షత పదిమందికీ తెలియడం అవసరం. నువ్వక్కడ సంపాదించినా, సంపాదించక పోయినా రెండు సంవత్సరాలలో తిరిగి వస్తే, నా కూతుర్నిచ్చి పెళ్ళి చేస్తాను, అంగీకరించు. నీ కోసం ఎదురు





చూస్తుంటాను!" అన్నాడు.

అయితే అరుణను చూశాక, ఆమె అందచందాలకు పరవశుడైన వినయశీలి, ఆమెతో, "నిన్ను చూశాక, బంధువుల్ని వదలి కుంతలదీవి వెళ్ళాలనిపించడం లేదు. నిన్ను పెళ్ళి చేసుకుని ఇక్కడే వుండిపోనా?" అని అడిగాడు.

అరుణ సిగ్గుతో తలవంచుకుని "బావా! గొర్రెకు ఎంత ఎదిగినా బెత్తెడే తోకన్నట్టు ఈ కోదండపురంలో సంపాదన ఏ మూలలకు? కోటికి పడగలెత్తాలంటే, సముద్ర ప్రయాణం చేసి, విదేశాలలో వ్యాపారం ప్రారంభించడం, మన వర్తకులకు అనాదినుంచీ వున్న ఆచారం. నీకు లభించిన రాజానుమతిని సద్వినియోగం చేసుకో. ఏముంది రెండు సంవత్సరాలిట్టే గడిచేస్తాయి. నేను నీకోసం ఎదురు చూస్తుంటాను. మరొక సంగతి. నువ్వు దూరదేశంలో వ్యాపారం చేసి ఎంత సంపాదించుకు వచ్చావు అనేదాని కన్న, విదేశ వ్యాపారం చేసిన వ్యక్తి భార్యగా, నాకు గుర్తింపు పొందాలని వుంది," అన్నది.

ఇందుకు వినయశీలి చాలా సంతోషించి, "మగవాడికి ఇష్టమైన స్త్రీ ప్రోత్సాహం లభించాలని ఎందుకంటారో నాకిప్పుడు తెలిసింది. రెండు సంవత్సరాలు నాకోసం ఒక సుందరి ఎదురు చూస్తున్నదన్న భావన, నా వ్యాపారానికి గట్టి పునాది అవుతుంది!" అని చెప్పి, మేనమామ దగ్గర ఆశీర్వాదం పొంది, తల్లిదండ్రులు దీవించి వీడ్కోలు చెబుతూంటే - ఒక మంచి రోజున ఓడ ఎక్కి కుంతల దీవి చేరుకుని, వ్యాపారం ప్రారంభించాడు.

కుంతలదీవిలో వినయశీలి వ్యాపారం మూడు పువ్వులూ, ఆరుకాయలుగా సాగింది. రెండు సంవత్సరాలూ పూర్తి



కావచ్చాయి. ఈ మధ్యకాలంలో అతడు, వార్తాహరుల ద్వారా తన క్షేమ సమాచారాలతో పాటు, తల్లిదండ్రులకు డబ్బు కూడా పంపాడు. ఆ డబ్బుతో అతడి తండ్రి వ్యాపారంలో వచ్చిన నష్టాన్ని పూడ్చుకుని, తిరిగి పుంజుకుని కొడుకు రాక కోసం ఉత్సాహంగా ఎదురు చూడసాగాడు.

ఇలా వుండగా కుంతలదీవిలో రాజుపై హత్యాప్రయత్నం జరిగింది. ప్రమాదం నుంచి బయటపడిన రాజు, విచారణ జరిపి, తనను హత్య చేయాలని ప్రయత్నించిన దోషుల స్థావరం విదేహ దేశంలో వున్నదని తెలుసుకున్నాడు. అందుచేత ఆయన, విదేహ రాజుకు నిరసన తెలియజేస్తూ "నాపై హత్యా ప్రయత్నం జరిపిన దోషుల స్థావరం విదేహ దేశంలో వున్నదని రుజువైంది. మేము మిమ్మల్ని మిత్రదేశంగానే భావిస్తున్నాం. అందుచేత దోషుల స్థావరాన్ని తెలుసుకుని, వాళ్ళను అప్ప గించవలసిన బాధ్యత మీపైన వున్నది. ఈ విషయంలో మీరు తగు విధంగా సహకరించకపోతే, మా శత్రువులుగా భావించి - ప్రథమ చర్యగా, మా దీవిలో వ్యాపారం చేసుకుంటున్న మీ వర్తకు లందరినీ ఊచకోత కోయించగలం!" అని హెచ్చరిక చేశాడు.

విదేహరాజు ఆ హెచ్చరికనూ, కుంతల దీవి శత్రువుల స్థావరం, తన దేశంలో వున్నదన్న ఆక్షేపణనూ భరించలేక పోయాడు. ఆయన తన గూఢచారులతో, "కుంతల దీవి రాజు, మన మీద వేసిన అపవాదు వెనుక ఏమైనా నిజమున్నదేమో త్వరగా తెలుసుకోవాలి. ఎంత గొప్పవాడైనా, రాజాస్థానంలో ప్రాపకం వున్నవాడైనా సరే అనుమానితులందర్నీ, ఒక కంట కనిపెట్టి వుండండి!" అని ఆజ్ఞాపించాడు.

గూఢచారులు దేశమంతా తీవ్రంగా గాలించ సాగారు. కుంతల దీవిలో వ్యాపారం చేస్తున్న వినయశీలికి, కోదండ సెట్టి మేనమామ అయిన కారణంగా, ఆయన ఇంటినీ రహస్యంగా తగు కాపలాలో వుంచారు.

ఈ పరిస్థితుల్లో సెట్టి బంధువుల ఇంట్లో పెళ్ళి చేయించడానికి ఒక పురోహితుడు, పెళ్ళిలో చివరి రోజు ఇచ్చే

నాకబలి కట్నం కోసం ఒక కవి వచ్చారు. ఆ ఇద్దరికీ కోదండ సెట్టి ఒక గదిని బసగా ఇచ్చాడు. పురోహితుడు తన చొక్కాను గోడ మేకుకు తగిలించబోతూ, తూలొచ్చి దాన్ని ఊతంగా పట్టుకోవడంతో చిరిగింది.

అది చూసిన కవి, "ఎముకలు లేవు, తల లేదు చేతులున్నా వేళ్ళు లేవు. పాదాలు కూడా లేవు. చిరిగినా ఫర్వాలేదు, తొడుక్కున్నాక ప్రాణం వస్తుంది!" అంటూ పెద్దగా నవ్వసాగాడు.

ఇందుకు పురోహితుడు విసుక్కుని, "అయ్యా కవిగారూ, చొక్కా మీద కవిత్వం ఆపి, కొంచెం సూదీ, దారం అడగండి. కుట్టుకుంటాను," అన్నాడు.

దానికేం భాగ్యం, అంటూ కవి గదిలోంచి బయటికి తొంగి చూసి కనిపించిన అరుణను పిలిచి, "ఒక కన్నుంటుందిగాని కాకి గాదు, అది కావాలి! దాంతో పాటే, సముద్రంలా పెరుగుతుంది, చంద్రుడిలా తరుగుతుంది కానీ సముద్రుడూ, చంద్రుడూ కానిదీ కూడా ఇచ్చావంటే, పురోహితుడు గారి అవసరం వెంటనే తీరుతుంది!" అన్నాడు.

ఈ మాటలు విని అరుణ తెల్లమొహం వేసింది. ఆ పక్కనే వున్న కోదండ సెట్టి లబలబలాడుతూ, "కవిగారూ! ఇలా అర్థం లేని మాటలు చెప్పి, నా కొంప మీదికి ప్రమాదం తెచ్చి పెట్టకండి, దేశంలో పరిస్థితులు బాగా లేవు. గూఢచారులు విన్నారంటే, ఇదేదో రహస్య సంభాషణ అనుకుని, మిమ్మల్నీ, నన్నూ



చెరసాలలో వేసి చిత్రహింసలు పెడతారు!" అని, అన్ని విషయాలూ చెప్పాడు.

కోదండ సెట్టి భయం చూసి, కవి నవ్వి, "సెట్టిగారూ! ఇందులో రహస్య సంభాషణ అంటూ ఏమీ లేదు. వినండి! ఒకే కన్నుండేది సూది. పెరుగుతూ తరిగేది దారం. ఏదో కొంత చమత్కారంగా మాట్లాడడం, మా కవులకు అలవాటు. నీ ఇంట్లో బస ఇచ్చి ఆదరించినందుకు నీకు దీవెనలు. నీకు కష్టాలు కలిగిస్తున్న శత్రువులకు శాపాలు ఇస్తున్నాను. కవి వాక్కు బ్రహ్మ వాక్కు. ఒక సంగతి; శత్రువులు తమ స్థావరాలు ఎవరికీ అనుమానం కలక్కుండా వుండేందుకు దేవాలయ ప్రాంతాలలోనే పెడతారు. నిజంగా అలాగే జరగాలని ఆశిస్తూ,

మళ్ళీ సగం దీవెన, సగం శాపం వుండే దేవుడి పేరుగల చమత్కారంతో నిన్నాశీర్వదిస్తున్నాను! ఆకాశంలో ఎగిరే పక్షులరాజైన వారి రాజుకు శత్రువెవరో వాడి పేరులోని మొదటి అర్థం నీకు, రెండవ అర్థం శత్రువులకు కలుగుగాక!" అని ఆశీర్వదించాడు. ఇది విన్న కోదండసెట్టి అర్థం కాక తలగోక్కున్నాడు. కానీ, అతడి ఇంటి కాపలా వేసిన గూఢచారులకు, శత్రువులు దేవాలయం దగ్గర స్థావరం ఏర్పాటు చేసుకుని వుండవచ్చునన్న అభిప్రాయం కలిగింది. అందుచేత కవి మాటలను మననం చేసుకుని, గూఢచారులు ఇలా అర్థం తీశారు పక్షులకు రాజు గరుత్మంతుడు. గరుత్మంతుడి రాజు విష్ణుమూర్తికి శత్రువు హిరణ్యకశిపుడు. ఆయన్నే హిరణ్యకశిపువు అని కూడా అంటారు. హిరణ్యం అనగా బంగారం సెట్టికి, కశివు అనగా దీర్ఘనిద్ర కలిగించు తల్పము (చావు) శత్రువులకు కలుగుగాక!

కోదండపురం గ్రామపు స్థల పురాణంలోని విశేషమేమంటే అక్కడ అతి ప్రాచీన కాలంలో, గరుత్మంతుడి చేత ప్రతిష్ఠించబడిందని చెప్పబడే నృసింహదేవాలయమొకటి వున్నది. హిరణ్యకశిపుణ్ని నృసింహావతారంతోనే విష్ణువు చంపాడు గదా! కవి చమత్కారపు మాటల్లోని అర్థాన్ని తమ అదృష్టానికి పరీక్షగా పెట్టుకుని, గూఢచారులు ఆ దేవాలయ ప్రాంతంలో గాలించేసరికి, కుంతల దీవి రాజద్రోహుల స్థావరం బయటపడింది.

రాజు వాళ్ళను బంధించి కుంతలదీవి రాజుకు అప్పగించాడు. వినయశీలి, మరికొందరు విదేహ దేశపు వర్తకులు క్షేమంగా తిరిగి వచ్చారు. వినయశీలి, అరుణల వివాహ సమయంలో రాజు స్వయంగా వచ్చి, దంపతుల నాశీర్వదించడమే కాకుండా, కోదండసెట్టికి హిరణ్యం, కవికి గొప్పగా ధనం ఇచ్చి సన్మానం చేసి, కవివాక్కు బ్రహ్మవాక్కని కొనియాడాడు.



47. కృష్ణరాయబారం

# మహాభారతం

ధృతరాష్ట్రుండు కూడా యుద్ధం ప్రమాదకరమని దుర్యోధనుణ్ణి హెచ్చరించాడు. దుర్యోధనుడు ఎవరి మాటలూ వినిపించుకోలేదు. అంతవరకు సభలో కూర్చుని ఉన్న రాజులు యుద్ధం తప్పదని రూఢి చేసుకుని, లేచి వెళ్ళిపోయారు.

ధృతరాష్ట్రుడికి తన కొడుకులు యుద్ధం చేసి గెలవాలన్న ఆశ ఉన్నది. ఆయన సంజయుణ్ణి రహస్యంగా పిలిచి, "సంజయా, నీకు పాండవ బలమూ, మన బలమూ కూడా తెలుసు గనక, పాండవుల పక్షాన యుద్ధం చేసేవారిలో ఉత్సాహంగా ఉన్న వారెవరో, నీరసంగా ఉన్నవారెవరో, బలంగలవారూ, బలహీనులూ ఎవరో కాస్త చెప్పు," అన్నాడు.

దానికి సంజయుడు, "రాజా, నేను నీకు ఏకాంతంలో ఏమీ చెప్పను. నేను చెప్పేది విని నువ్వు అసూయపడతావు. అందుచేత వ్యాసుణ్ణీ, గాంధారినీ ఇక్కడికి పిలిపించు," అన్నాడు.

త్వరలోనే వ్యాసుడూ, గాంధారీ వచ్చారు. అప్పుడు సంజయుడు ధృతరాష్ట్రుడితో, "రాజా, కృష్ణార్జునులు అవతార పురుషులు, మహావీరులు. కృష్ణుడు నీ కొడుకులను నిర్మూలించ సంకల్పించాడు", అన్నాడు.

"సంజయా, ఈ రహస్యం నీకెలా తెలిసింది? నాకెందుకు తెలియలేదు?" అని ధృతరాష్ట్రుడు అడిగాడు.

"రాజా, నువ్వు విద్యా విహీనుడివి. తమస్సుతో నిండినవాడివి. నేను విద్య ద్వారా కృష్ణుడి మహత్తు తెలుసుకున్నాను," అన్నాడు సంజయుడు.

వ్యాసుడు ధృతరాష్ట్రుడితో, "నువ్వంటే కృష్ణుడికి చాలా ఇష్టం. ఈ సంజయుడు





కృష్ణుడి సంగతి పూర్తిగా తెలిసినవాడు. ఇతను చెప్పినట్టు చేస్తే నీకు లాభం కలుగుతుంది," అని చెప్పాడు.

ఈ లోపుగా ఉపప్లావ్యంలో, సంజయుడు తన రాయబారం ముగించి, హస్తినాపురానికి తిరిగి వెళ్ళిపోగానే, ధర్మరాజు కృష్ణుడితో, "కృష్ణా, ఇదే మాకు మిత్రులు సహాయపడదగిన సమయం. ఈ ఆపత్సమయంలో మమ్మల్ని ఆదుకోగల వాడివి నువ్వు ఒక్కడివే. నిన్ను నమ్ముకునే మేము కౌరవులను నాశనం చేయ సంకల్పించాం. మమ్మల్ని కాపాడే భారం నీదే!" అన్నాడు.

"నువ్వు ఏమి చెప్పదలచావో అది నిశ్శంకగా చెప్పు," అన్నాడు కృష్ణుడు. ధర్మరాజు ఇలా అన్నాడు:

"సంజయుడు చెప్పినదంతా విన్నావు గదా. ధృతరాష్ట్రుడు చెప్పమన్న మాటలే అతను చెప్పాడు. ఆ ముసలి లోభి మాకు రాజ్యం ఇవ్వకుండానే మా నుంచి శాంతి కోరుతున్నాడు. ధృతరాష్ట్రుడి నిజాయితీని నమ్మి మేము ఘోరమైన అరణ్యవాసం అనుభవించాం. కాని అయన దుర్యోధనుడి ఇష్టానుసారమే పోతాడు. నేను నా తల్లికి గాని, హితులకు గాని కొంచెం కూడా సుఖం కలిగించలేక పోయాను. కనీసం మా అయిదుగురికీ అయిదు ఊళ్ళు ఇస్తే యుద్ధం మానేస్తానన్నాను. ధృతరాష్ట్రుడు అందుకు కూడా సిద్ధంగా లేడు. దారిద్ర్యం కన్నా చావు మేలు. క్షత్రియధర్మం చాలా పాపిష్ఠిది. కాని క్షత్రియులమైన మేము ఆ ధర్మాన్ని విడిచి, ఇతర వృత్తులను అనుసరించలేం. అందుచేత మేము శాంతి మార్గాన్నే కోరుతున్నాం. అది పనికి రానప్పుడు యుద్ధం ఉండనే ఉన్నది. అందుచేత ఇప్పుడు మాకు ఏది కర్తవ్యమో చెప్పు."

దానికి కృష్ణుడు, "రాజా, నాకు మీరూ వారూ ఒకటే. మీ ఉభయపక్షాల శ్రేయస్సు కోరి నేను కౌరవుల వద్దకు పోతాను. మీ ఆశయాలకు భంగం కలగకుండా కౌరవులకు శాంతి కలిగేట్టు చేశానంటే నాకు ఎంతో పుణ్యం వస్తుంది. ఎంతోమందికి చావు రాకుండా చేసినవాణ్ణి అవుతాను," అన్నాడు.

ధర్మరాజు ఇందుకు సమ్మతించక, "దుర్మార్గుడైన దుర్యోధనుడు నీ మాట వినడు. అతని వద్ద చేరిన రాజులందరూ

అతని ధోరణి గల వాళ్ళే. అలాటి వాళ్ళ మధ్యకు నువ్వు వెళ్ళటం నాకెంత మాత్రమూ ఇష్టం లేదు. నీకు లేశ మాత్రం బాధ కలిగినా నేను సహించలేను," అన్నాడు.

దానికి కృష్ణుడు, "ధర్మరాజా, దుర్యోధనుడి సంగతి నేనెరుగుదును. అక్కడి వాళ్ళకు నా సంగతీ తెలుసు. వాళ్ళు నాజోలికి రావటానికి సాహసించరు. ఒక వేళ వస్తే అందరినీ భస్మీపటలం చేస్తాను. మనం శాంతి కోసం ప్రయత్నించకపోతే లోకాపవాదానికి గురి అవుతాం. అందుచేత నేను అక్కడికి వెళ్ళటం అవసరమే," అన్నాడు.

"నీకు ఎదురు చెప్పటానికి నేనెంత వాణ్ణి? నువ్వు క్షేమంగా వెళ్ళి, మా కార్యం చక్కబెట్టి, శాంతి సాధించి, తిరిగి రా. అవసరాన్ని బట్టి మంచిగానూ, కరకుగానూ మాట్లాడు," అన్నాడు ధర్మరాజు .

దానికి కృష్ణుడు, "ధర్మరాజా, నువ్వు ధర్మాన్ని ఆశ్రయించావు. కౌరవులు వైరాన్ని ఆశ్రయించారు. క్షత్రియుడు జయించినా, మరణించినా యుద్ధం చెయ్యటమే అతని ధర్మంగాని బిచ్చమెత్తుకోవడం కాదు. వాళ్ళు చాలామంది స్నేహితులను చాలా కాలంగా సమకూర్చుకుని బలవంతులై ఉన్నారు. వారు శాంతికి ఒప్పుకుంటారనుకోకు. నువ్వు మెత్తగా కనబడినంత కాలమూ వాళ్ళు నీ రాజ్యం అనుభవిస్తూనే ఉంటారు. నీకు చేసిన ద్రోహాలకు వాళ్ళు కొంచెమైనా పశ్చాత్తాప పడటం లేదు. వాళ్ళను దయ తలచకు. నువ్వు



ధృతరాష్ట్రుణ్ణీ, భీష్మణ్ణీ తలుచుకుని భక్తిభావం చూపటం నాకు కొంచెం కూడా నచ్చలేదు. నేను వెళ్ళి, కౌరవ సభలో అందరి అపోహలూ తొలగించి, నీ ధర్మబుద్ధి అందరికీ అర్థమయ్యేటట్టు చేస్తాను. నేను నీకు నష్టం కలగకుండా శాంతి కోసమే ప్రయత్నిస్తానుగాని, పరిస్థితి చూస్తే యుద్ధం తప్పదనే నాకు అనిపిస్తున్నది. దుర్యోధనుడు బతికి ఉండగా, నీ రాజ్యం నీకు దక్కదు. అందుచేత తగు ప్రయత్నంలో ఉండు," అన్నాడు.

అప్పుడు భీముడు కృష్ణుడితో, "కృష్ణా, నువ్వు కౌరవ సభకు వెళ్ళటం చాలా ఉచితంగా ఉన్నది. అందరూ వింటూండగా నువ్వు దుర్యోధనుడితో మంచి మాటలు చెప్పి, శాంతి సాధించు. వాడిది




రాక్షస స్వభావం. వాడికి మంచిగా చెప్పటం చాలా కష్టమే. అందుచేత వాడితో స్నేహంగా మాట్లాడాలి. మా వంశానికి ఘోర ప్రమాదం రాకుండా చూడు. నాకుగాని, ధర్మరాజుకుగాని, అర్జునుడికి గాని యుద్ధకాంక్ష లేదు. మేము శాంతిని కోరుతున్నాం," అన్నాడు.

భీముడు ఇంత సాధువుగా ఎన్నడూ మాట్లాడి ఉండలేదు. భీముడు అలా మాట్లాడటం చూస్తే నిప్పు చల్లగా ఉన్నట్టు తోచింది కృష్ణుడికి. అతను భీముణ్ణి రెచ్చగొట్టే ఉద్దేశంతో ఇలా అన్నాడు:

"భీమా, యుద్ధమంటే ఉత్సాహం గల వాడివి ఇలా నీరుగారి పోయి మాట్లాడు తున్నావేమిటి? ధృతరాష్ట్రుడి కొడుకులను చంపే ఉద్దేశం వదులుకున్నావా? దుర్యోధనుణ్ణి ఎప్పుడు చంపుతానా అని అహోరాత్రులు అలమటించినవాడివి. నిన్ను చూస్తే పిచ్చి ఎత్తుతుందేమోనని పించింది. అలాటి వాడివి శాంతి కోసం దేవులాడటం ఎంత ఆశ్చర్యం! నిజం ఏమి టంటే, నువ్వు బెదిరిపోయావు. అందుకే శాంతి కోరుతున్నావు. నీ పరాక్రమాన్నే నువ్వు మరిచావు. నువ్వు మాట్లాడుతుంటే ఇంకె వరో మాట్లాడుతున్నట్టున్నది. ఈ అధైర్యం నీకు నప్పటం లేదు. క్షత్రియుడివి, గొప్ప కార్యాలు సాధించినవాడివి. నీ వంటి వాడు తన ప్రయోజకత్వంతో సంపాదించి నది తప్ప అనుభవించ గోరడు."

ఈ మాటలు విని భీముడికి చాలా రోషం వచ్చింది. అతను ఇలా అన్నాడు:

"కృష్ణా, నేను ఒకటి చెబితే, నువ్వు మరొకటి అనుకున్నావు. నాకు యుద్ధ మంటే ఇష్టం లేదని ఎలా అనుకున్నావు? ఇంత కాలం నన్ను ఎరిగి ఇదేనా నువ్వు గ్రహించినది? నన్ను తెలిసినవాళ్ళెవరూ నీలాగా మాట్లాడరు. చెబుతున్నాను విను. నేనే చెప్పుకోవటం తప్పు గాని, నా బలమూ, పౌరుషమూ సాటిలేనివి. నా చేతికి చిక్కిన వాడు ప్రాణాలతో బయటపడలేదు. యుద్ధం జరిగినప్పుడు నా పరాక్రమం నువ్వే చూస్తావు. నేను భయపడలేదు. మా భరతవంశం నాశనం కావటం ఇష్టం లేకనే నేను నీతో శాంతవచనాలు చెప్పాను."

ఈ మాటలకు కృష్ణుడు నవ్వి, "భీమా, నిన్ను నిందించటానికి నేను అలా అన లేదు. నీ శక్తులు నీ కన్న కూడా నాకు బాగా తెలుసు. నేను కౌరవ సభలో మీ

ప్రయోజనంతోబాటు శాంతి సాధించటానికే ప్రయత్నిస్తాను. కాని నా ప్రయత్నం నెరవేరకపోతే యుద్ధం తప్పదు. అప్పుడు భారమంతా నీ మీదనే ఉండబోతుంది. నేనై యుద్ధం కోరను. నీ మనసు తెలుసుకోగోరి అలా అన్నాను, అంతే!" అన్నాడు.

తరవాత అర్జునుడు కృష్ణుడితో, "కౌరవ సభలో నువ్వు చెప్పదగినది ధర్మరాజు చెప్పాడు. కౌరవులు శాంతికి అంగీకరించరని నువ్వు అనుకుంటున్నట్టు కనబడుతున్నది. అదే జరగవచ్చు కూడా. అయినా ప్రయత్నించకుండా ఉండరాదు. మాకూ మాకూ సఖ్యం కలిగేటట్టు ప్రయత్నించు. అది నీకు అసాధ్యం కాదనుకుంటాను. లేదా, నువ్వు మరొక విధంగా నిర్ణయించినా దానివల్ల మాకు మేలే అవుతుంది. వాళ్ళను చంపటం తప్పనిసరి అయితే అలాగే చేయవచ్చు. మాకు ఏది మేలో అది నువ్వే నిర్ణయించు," అన్నాడు.

"అర్జునా, నేను చేయవలసిన ప్రయత్నమంతా చేస్తాను. శకుని కర్ణులు ఎగదోస్తూ ఉండగా దుర్యోధనుడు మంచిగా మీకు రాజ్యం ఇవ్వడు. ధర్మరాజు శాంతి కోరుతున్నట్టు ఆ దుర్మార్గుడితో చెప్పగూడదనుకుంటున్నాను. వాడి సంగతి తెలియనట్టు మాట్లాడతావెందుకు?" అన్నాడు కృష్ణుడు.

తరవాత నకులుడు కృష్ణుడితో, "మా అన్నలు తమ అభిప్రాయాలు చెప్పారు. నీ అభిప్రాయం నీకున్నది. కాని ఇవేవీ అమలు కాకపోవచ్చు. పరిస్థితిని బట్టి అందరి అభిప్రాయాలూ మారుతాయి. కనక పరిస్థితిని బట్టి చెయ్యదగినది చెయ్యి" అన్నాడు.



సహదేవుడు కృష్ణుడితో, "ధర్మరాజు ధర్మమే చెప్పాడు గాని, నువ్వు మటుకు తప్పక యుద్ధం జరిగేటట్టు చూడు. వాళ్ళు శాంతి కావాలన్నా కూడా ఆ ప్రయత్నం చెడగొట్టు," అన్నాడు.

సాత్యకి సహదేవుణ్ణి బలపరిచాడు. పాండవుల పక్షాన వచ్చిన యోధులందరూ సింహనాదాలు చేశారు.

అప్పుడు ద్రౌపది దుఃఖిస్తూ కృష్ణుడితో, "ధర్మరాజు శాంతి కోరి అయిదూళ్ళు చాలునన్నా ఆ దుర్యోధనుడు ఒప్పుకోలేదు. పాండవులకు రాజ్యం ఇస్తేనే గాని నువ్వు శాంతికి ఒప్పుకోకు. యుద్ధంలో పాండవులు కౌరవులను చంపగలరు. అదే వారికి సరిఅయిన మార్గం. నాకు తీరని అవమానం చేసిన ఆ దుర్యోధనుడు

ఇంకా బతికే ఉన్నాడు. నువ్వు సంధి మాటలు మాట్లాడేటప్పుడు నా జుట్టును మరిచిపోకు. ఇది పట్టుకునే నన్ను నిండు సభలోకి ఈడ్చుకు వచ్చారు. దుశ్శాసనుడి చెయ్యి తెగిపడటం చూస్తేగాని నాకు శాంతి కలగదు," అంటూ శరీరం అదిరేటట్టుగా ఏడ్చింది. కృష్ణుడు ఆమెను ఓదార్చాడు.

కృష్ణుడు పాండవుల రాయబారిగా బయలు దేరుతూ, సాత్యకితో, "సాత్యకీ, నా రథంలో శంఖమూ, చక్రమూ, గదా, ఇతర ఆయుధాలూ పెట్టు. దుర్యోధనుడు దుర్మార్గుడు. అతనికన్న దుర్మార్గులు కర్ణ శకునులు. ఎంతటి బలవంతుడైనా శత్రువు బలహీనుడని నిర్లక్ష్యం చెయ్యరాదు," అన్నాడు.

అంతా సిద్ధమయ్యాక కృష్ణుడు తన రథంలో సాత్యకిని కూడా ఎక్కించుకుని హస్తినాపురానికి బయలుదేరాడు. పాండవులూ, చేకితానుడూ, ధృష్టకేతుడూ, ద్రుపదుడూ, కాశీరాజూ, ధృష్టద్యుమ్నుడూ, విరాటుడూ మొదలైన రాజులు కృష్ణుణ్ణి కొంతదూరం సాగనంపారు.

వాళ్ళు తిరిగి వెళ్ళేటప్పుడు ధర్మరాజు కృష్ణుణ్ణి కౌగలించుకుని, "కృష్ణా, మా అమ్మను, కుంతిని కుశలం అడుగు. ఆమె మమ్మల్ని ఎంతో గారాబంగా పెంచింది; మాకు ఏ ఆపదా రాకుండా వెయ్యి కళ్ళతో కాపాడింది; మా మూలాన పడరాని పాట్లు పడ్డది. మా అందరి పక్షానా నువ్వు ఆమెను కౌగలించుకో. ఆమెను ఓదార్చు. ధృతరాష్ట్రుడూ, భీష్మ ద్రోణకృపులూ, బాహ్లిక సోమదత్తులూ, అశ్వత్థామా మొదలైన పెద్దలందరికీ నా నమస్కారాలు చెప్పి, కుశలం అడుగు. విదురుణ్ణి నాకు బదులు కౌగలించుకో," అన్నాడు.

తరవాత అందరూ కృష్ణుడి వద్ద సెలవు పుచ్చుకుని వెనక్కు మరలి వెళ్ళారు.

దారుకుడు తోలుతున్న కృష్ణుడి రథం అమిత వేగంగా ప్రయాణం సాగించింది. కృష్ణుడు కౌరవుల రాజ్యం ప్రవేశించి, వృకస్థలంలో ఆ రాత్రి మజిలీ చేయ నిశ్చయించాడు. అక్కడ అతను విడిదిలో దిగగానే ఆ గ్రామంలోని పెద్దలందరూ అతన్ని చూడవచ్చి, అతన్ని తమ ఇళ్ళకు తీసుకుపోయి, సత్కరించారు. కృష్ణుడు వారికి తన విడిదిలో ఆతిథ్యం ఇచ్చి, సత్కరించాడు.



పురాణకాలంనాటి రాజులు:

# దంబోద్భవుడు

ఒకానొకప్పుడు సకల సంపదలకూ నిలయమైన ఒకానొక రాజ్యాన్ని దంబోద్భవుడనే రాజు పాలించేవాడు. పరిపాలన ధర్మబద్ధంగా సాగేదే గాని, ఆయనలో మితిమించిన అహంభావం చోటు చేసుకున్నది. భూలోక ప్రజలందరూ తనను గొప్ప రాజుగా గుర్తించి గౌరవించాలనే తహ తహ ఆయనలో పెరిగిపోయింది. సింహాసనంలో ఆసీనుడు కాగానే, "మంత్రులారా! సేనాధిపతులారా! రాజప్రతినిధులారా! నాకన్నా శక్తి సంపన్నుడూ, గొప్పవాడూ ఈ భూప్రపంచంలో ఎవడైనా ఉన్నాడా? చెప్పండి!" అని రోజూ అడిగేవాడు.

రాజాగ్రహానికి గురికావడానికి ఇష్టం లేని సభికులు, "లేరు ప్రభూ! లేరు! తమకు సాటి ఎవరూ లేనే లేరు!" అని ముక్తకంఠంతో ఘోషించేవారు.

రాజు సంతోషంతో పొంగిపోయేవాడు.

కొన్నాళ్ళకు ఒక ముని ఆ రాజ్యానికి వచ్చాడు. రాజు ఆ మునిని కూడా అదే ప్రశ్న అడిగాడు. అందుకు ముని, "ఉన్నారు ప్రభూ! ఒకరు కాదు, ఇద్దరు!" అన్నాడు.

"నరనారాయణులు! గంధమాదన పర్వతం మీద ఉన్నారు. వాళ్ళే మానవులందరిలోకీ గొప్ప వాళ్ళు!" అని చెప్పి ముని వెళ్ళిపోయాడు.

ముని సమాధానానికి దిగ్భ్రాంతి చెందిన రాజు అమితావేశంతో సైన్యాన్ని వెంటబెట్టుకుని గంధమాదన పర్వతంకేసి బయలుదేరాడు. తీరా అక్కడికి వెళ్ళి చూస్తే, బక్కచిక్కిన ఇద్దరు మునులు శిఖరాగ్రం మీద కూర్చుని ధ్యాన నిమగ్నులై కనిపించారు.

వాళ్ళను చూసిన దంబోద్భవుడు తీవ్రమైన నిరాశకు గురయ్యాడు. ఇంత దూరం వచ్చి వృథాగా తిరిగి వెళ్ళడం ఇష్టంలేక, వాళ్ళను రెచ్చగొట్టడానికి ప్రయత్నించాడు. ఫలించలేదు. ఆఖరికి వాళ్ళను పరుష పదజాలంతో దూషించసాగాడు.

అప్పటికి ఇద్దరు మునులలో ఒకడైన నరుడు మెల్లగా కళ్ళు తెరిచి, దాపులనున్న దర్భ మొక్కనుంచి మూడు పోచలను తుంచి రాజు సైన్యం కేసి విసిరాడు. మరుక్షణమే సైనికులకు కళ్ళు పోయాయి. వాళ్ళ రూపాలు కూడా మారిపోయాయి.

మునులకున్న ఆధ్యాత్మిక శక్తి ముందు తన బలం తృణప్రాయమేనని దంబోద్భవుడికి అర్థమయింది. ఆయనలోని అహంకారం పటాపంచలయింది. తన అపరాధాన్ని క్షమించమని మునుల పాదాలపై పడ్డాడు. నరనారాయణులు ఆయన్ను క్షమించి సైనికులకు మళ్ళీ దృష్టిని ప్రసాదించి, యథారూపాలు వచ్చేలా చేశారు. ప్రజలను కరుణతో పరిపాలించాలనీ, మనసులోని అహంభావాన్ని వినయంతో అదుపులో వుంచుకోవాలని రాజుకు బోధించారు.

రాజు రాజ్యానికి తిరిగి వచ్చి, అహంకార రహితంగా పరిపాలన సాగిస్తూ, ప్రశాంతంగా జీవితం గడిపాడు!



## ఆంగ్లేయులను ఎదిరించిన యోధులు: ⑧ రాణీ చెన్నమ్మ

◆ రచన: మీరా ఉగ్రా
◆ చిత్రాలు: గౌతమ్ సేన్

నైరుతి భారతదేశంలోని కిట్టూరు చిన్నదే అయినప్పటికీ సంపన్నమైన సంస్థానం.



కిట్టూరు పాలకుడు శివలింగ రుద్ర సేర్జా తన దత్తపుత్రుణ్ణి, తన పినతల్లికి అప్పగించి, 1824వ సం॥లో మరణించాడు.



ధార్వార్‌లోని బ్రిటిష్ రాజకీయ ప్రతినిధి, రాజా దత్తపుత్రుణ్ణి రాజ్యానికి వారసుడిగా అంగీకరించనన్నాడు.




కొన్ని రోజుల తరవాత —







ఉభయ పక్షాలూ యుద్ధానికి సిద్ధమయ్యాయి. 1824, అక్టోబర్ 23వ తేదీ థాక్టరే సైనంతో వచ్చాడు.
తలుపులు తెరవండి!
వీలు కాదు. మిమ్మల్ని లోపలికి వదల కూడదని రాణిగారి ఆజ్ఞ!


ఇరవై నిమిషాలలో మీ రాణి లొంగిపోవాలి.... లేకుంటే కాల్పులు జరుపుతాం... వెళ్ళి చెప్పండి!


రాణిగారి సమాధానం కోసం అందరూ ఊపిరి బిగబట్టుకుని ఎదురు చూశారు. సమయం దాటి పోతూన్నప్పుడు —
నరకండి!
చంపండి!


హఠాత్తుగా జరిగిన ఎదురుదాడి ఆంగ్లేయులకు దిగ్భ్రాంతి కలిగించింది.
ఏమిటీ...!


అయ్యో!
థాకరేతో సహా ఆంగ్లేయులందరూ హతులయ్యారు.

అయినా, మరొక యుద్ధం తప్పదని రాణి చెన్నమ్మకు తెలుసు.




అయినప్పటికీ, ప్రజలు ఆమె పిలుపును అందుకుని ముందుకు వచ్చారు.







డిసెంబర్ 1వ తేది, కల్నల్ మెక్లాడ 25,000 సైన్యంతో కోటను ముట్టడించాడు.

కోట దృఢంగా వుంది. కోటలోని సైనికులూ ధైర్యంగా ప్రాణాలకు తెగించి పోరాడుతున్నారు. కాబట్టి లోపల వున్న వారికెవరికైనా లంచమిచ్చి సహాయం కోరడమే మంచి ఉపాయం.






రాణి చెన్నమ్మ మనుషులు ఎదురు కాల్పులు.
జరపలేక హడలిపోయారు.
మందు గుండు సామగ్రి తడిసి పోయింది. ఇదేదో ద్రోహ కృత్యం. మన లోనే ద్రోహి ఎవడో ఉన్నాడు!


డిసెంబర్ 4వ తేదీ సాయంకాలానికి కోట
దాదాపు పతనమయింది!
ఆంగ్లేయులు ఏ క్షణంలో నైనా లోపలికి జొరబడవచ్చు. తమరు ఇక్కణ్ణించి తప్పించు కోవాలి. రాణిగారూ! రండి.


కాని...
ఆగు!
రాణి చెన్నమ్మ ఖైదుచేయబడింది.


ధైర్యవంతురాలైన రాణి చెన్నమ్మ, తిరిగి స్వాతంత్ర్యం పొందలేదు. సంగోలి రాయణ్ణ, నాయకత్వపు బాధ్యతలు చేపట్టాడు. రాయణ్ణ ఆంగ్లేయులకు పక్కలో బల్లెంగా తయారయ్యాడు.
THE END



# గద్దముక్కు మంత్రగత్తె!

రాచవరం గ్రామంలో వుండే రమణయ్యకు, లలిత ఒక్కగానొక్క కూతురు. ఆమెకు, బావ నరహరితో పెళ్ళని, రమణయ్యతో పాటు కుటుంబంలో అందరూ అనుకున్నారు. రమణయ్య మంచి తెలివితేటలూ, చొరవా వున్నవాడు. ఆయన లలితకు పన్నెండేళ్ళ వయసులో గ్రామం విడిచి, పట్నం పోయి అక్కడ వ్యాపారంలో నాలుగైదేళ్ళు తిరక్కముందే లక్షలు ఆర్జించాడు. దానితో, ఇప్పుడాయనకు గ్రామంలో వ్యవసాయం చేసుకునే నరహరికి, తన కూతురినివ్వడం ఇష్టంలేదు.

అయితే, లలిత మాత్రం, "నేను పెళ్ళంటూ చేసుకుంటే, నరహరి బావనే చేసుకుంటాను!" అని ఖచ్చితంగా చెప్పేసింది.

కూతురి పట్టుదల ఎరిగిన రమణయ్య, పెళ్ళిమాటల కోసం చాలాకాలం తర్వాత, తన గ్రామానికి వెళ్ళాడు. అక్కడి నుంచి రెండు రోజుల తర్వాత తిరిగి వచ్చిన ఆయన, కూతురితో "ఇక ఆ నరహరిని మరిచిపో. వాడితో నీ పెళ్ళి జరుగదు!" అంటూ లోపలి గదిలోకి వెళ్ళిపోయాడు.

భార్య తరచి తరచి అడిగిన మీదట, ఆయన అసలు సంగతి వివరించాడు. రెండు మాసాల క్రితం నరహరి ఇల్లు వదిలి వెళ్ళిపోయాడట! గ్రామానికి తూర్పున వున్న అడవిలో ఒక చెరువుగట్టు మీద, ఒక చిన్న కుటీరంలాంటిది కట్టుకుని అందులో వుంటున్నాడట. తన వాళ్ళను కలవడానికిగానీ, కనీసం మాట్లాడడానికిగానీ ఇష్టపడడం లేదు.

ఇదంతా చెప్పి రమణయ్య, "అటువంటి సన్యాసికి మన అమ్మాయినిచ్చి, ఎలా పెళ్ళిచేస్తాం?" అన్నాడు.

భర్త మాటలు ఆశ్చర్యపోతూ విన్న రమణయ్య భార్య, "ఔరా, అలాగా!

మాచిరాజు కామేశ్వరరావు



అవునవును ఎలా ఇస్తాం?'' అంటూ వంత పాడింది. ఆ రాత్రంతా లలితకు నిద్ర లేదు. నరహరిని కలిసి నిజానిజాలు తెలుసుకోవాలనుకుందావె. తను నరహరిని చూడడానికి వెళతానంటే ఒప్పుకోరు. అందువల్ల ఆమె, చీకటితోనే ఇల్లు వదిలి బయలుదేరింది.

ఆమె నరహరి కుటీరం వేసుకుని వున్న చెరువు గట్టు చేరేసరికి, సాయంత్రం కావొస్తున్నది. నరహరి చెరువు గట్టు మీద కూర్చుని, చెరువులో ఎగిరెగిరి పడుతున్న చేపలకేసి చూస్తున్నాడు.

అతడు, లలితను చూసీ చూడగానే నివ్వెరపోయాడు. లలిత, అతడి పక్కనే కూర్చుంటూ, "ఎందుకీ అరణ్యవాసం? ఎవరి మీద కోపం?'' అని అడిగింది.

"అసలు ఇక్కడికి నువ్వెందుకు వచ్చావు?'' అంటూ నరహరి కోపంగా ప్రశ్నించాడు.

లలిత తడువుకోకుండా, "మన పెళ్ళి సంగతి మాట్లాడడానికి,'' అన్నది.

"పెళ్ళీ గిళ్ళీ అంటూ మాట్లాడకు. వెంటనే వెళ్ళిపో!'' అన్నాడు నరహరి శాసిస్తున్నట్టుగా.

"ఊహుఁ, వెళ్ళను. నువ్వు ఇల్లు వదిలి రావడానికి కారణం చెప్పవలసిందే!'' అన్నది లలిత పట్టుదలగా.

"ఏ పరిస్థితులలోనూ చెప్పను!'' అంటూ నరహరి లేచి, విసురుగా కుటీరంలోకి పోయి తలుపు మూసుకున్నాడు. లలిత కళ్ళనీళ్ళు పెట్టుకుని, అక్కడి నుంచి బయలుదేరింది. అంతలో ఉరుములూ, మెరుపులతో వర్షం ఆరంభమైంది. లలిత ఒక మర్రిచెట్టు కింద తలదాచుకున్నది. చూస్తుండగానే చుట్టూ దట్టమైన చీకట్లు ముసురుకున్నాయి. కొద్దిసేపటికి వర్షమైతే తగ్గింది కానీ, ఏవో మృగాల అరుపులు ప్రారంభమయ్యాయి. చీకట్లో దారి తెలియక, ఆ రాత్రికి నరహరి కుటీరంలో

గడుపుదామని, అక్కడికి వచ్చింది.

ఆమె ఎంతసేపు తలుపు కొట్టినా తలుపు తెరిచేందుకు నరహరి రాలేదు. లలిత తలుపు పక్కనే వున్న కిటికీ లోంచి లోపలికి చూసింది. అక్కడ నరహరి లేడు. మంచం మీద ఒక పెద్ద గద్ద కనిపించింది. ఏమిటీ వింత, అనుకుంటూ, ఆమె తలుపు పక్కగా పడుకుని కళ్ళు మూసుకున్నది.

తెల్లవారి నరహరి తలుపు తీసుకుని బయటికి వస్తూనే, లలితను చూసి ఆశ్చర్యపోతూ, ఏదో ప్రశ్నించబోయేంతలో ఆమె జరిగింది చెప్పి, "రాత్రి లోపల నువ్వు లేవు, గద్ద వుంది. ఇప్పుడు గద్దలేదు నువ్వున్నావు. ఏమిటిదంతా బావా?" అని అడిగింది.

నరహరి పెద్దగా నిట్టూర్చి, "ఈ రహస్యం ఎవరికి తెలియకూడదను కున్నానో, వాళ్ళకే తెలిసిపోయింది. సరే, అంతా వివరంగా చెబుతాను, విను," అంటూ ఇలా చెప్పాడు:

దాదాపు రెండు మాసాల క్రితం, లలితను చూడాలనిపించి పట్నం బయలుదేరాడు, నరహరి. త్వరగా పట్నం చేరాలన్న ఆతృత కొద్దీ, అడవిలోని అడ్డదారి పట్టాడు. అడవిలో ఒక చింతల తోపు చేరుకునేనరికి సాయంత్రం కావస్తున్నది. ఆ తోపులో వున్న ఒక గుడిసె ముందు నులక మంచం మీద రాగి రంగు జుట్టు దువ్వుకుంటూ, ఒక వికార స్త్రీకూర్చుని వున్నది. కారు నలుపు శరీరం, గద్దముక్కు. గొంగళీ లాంటి ఎర్రంచు నల్ల



అంగరఖా కట్టుకుని వున్నదామె.

ఆమె, నరహరిని చూస్తూనే, "చాలా కాలానికి అందగాడొకడు, ఈ దారి గుండా వస్తున్నాడు! ఎక్కడికిరా ప్రయాణం?" అని అడిగింది.

ఆ వికారిని చూసి నరహరి చీదరపడుతూ, "నా గురించి నీకెందుకు? నాకాబోయే భార్యను చూడబోతున్నాను. నీకేమైనా అభ్యంతరమా?" అన్నాడు కోపంగా.

"ఆ, అభ్యంతరమే!" అంటూ ఆ వికారి గద్దముక్కును ముందుకు చాచి, రాగి రంగు జుట్టు ముడి వేస్తూ, "నేనింకా పెళ్ళికావలసినదాన్నే. ఇద్దరం ఈ చింత చెట్ల సాక్షిగా పెళ్ళాడేద్దాం," అన్నది నరహరిని సమీపిస్తూ.



"నన్ను అందగాడన్నావు, నరే నీ అందం మాటేమిటి? ఆ దిక్కుమాలిన ముఖాన్ని అద్దంలో ఎప్పుడైనా చూనుకున్నావా? గద్దముక్కు కారునలుపూ నువ్వూ, అన్నాడు" వెటకారంగా నరహరి.

వెంటనే వికారి గుడ్లురుముతూ, నరహరికేసి చూసి, "గద్దముక్కంటూ నన్నవమానిస్తావా? నేను కారునలుపా? సరే, ఆ కారునలుపు చీకట్లో గద్దగా, పగలు మనిషిగా చిత్రవధ అనుభవించు!" అంటూ ఏదో మంత్రం జపించింది.

అప్పుడు ఆ వికారి మంత్రగత్తె అని గ్రహించాడు, నరహరి, అయితే అంతగా మంత్రతంత్రాలంటే నమ్మకంలేని అతడు తన ప్రయాణం సాగించాడు. అడవి దాటుతుంగా చీకట్లు ముసురుకున్నాయి. వెంటనే నరహరి శరీరంలోంచి భరించలేనంత వేడి సెగలు పుట్టుకువచ్చి, అతడు గద్దగా మారిపోయాడు. ఆ రాత్రికి ఒక చెట్టుమీద తలదాచుకుని, తెల్లవారి మనిషి రూపం రాగానే, మంత్రగత్తెను కలుసుకుని, తనకు పట్టిన దురవస్థ నుంచి విముక్తి కలిగించమని, కాళ్ళా వేళ్ళా పడ్డాడు. మంత్రగత్తె మనసు కరగలేదు.

ఇదంతా చెప్పి నరహరి "ఈ సంగతి మా ఇంట్లో వాళ్ళకు, ముఖ్యంగా నీకు తెలిస్తే తీరని దుఃఖానికి గురవుతారని, ఇలా అందరికీ దూరంగా ఒంటరితనం అనుభవిస్తున్నాను," అన్నాడు బాధగా.

అంతా విన్న లలిత, నరహరితో ఒక్క మాట కూడా అనకుండా తిరుగు ప్రయాణమైంది. మంత్రగత్తెను కలుసుకుని తన బావకు పట్టిన దురవస్థ తొలగించాలని, ఆమె ఆలోచన.

లలిత చింతల తోపు చేరుకునేసరికి మధ్యాహ్నం అయింది. మంత్రగత్తె, చింత చెట్టునీడలోకి నులక మంచం ఈడ్చుకుని, దాని మీద కూర్చుని ఏదో తింటున్నది.

లలిత చొరవగా పోయి, మంత్రగత్తె పక్కన మంచం మీద కూర్చుంటూ, "అక్కయ్యా! భోజనం వేళ, ఏదో ఫలహారంతో సరిపెట్టుకున్నావేమిటి? అందుకే ఇలా చిక్కి శల్యం అయిపోతున్నావు" అన్నది.

"నువ్వెవత్తివే? దారిపోయేదానివి వరస కలుపుతూ మంచం మీద కూర్చున్నావు?"

అన్నది కోపంగా మంత్రగత్తె.

"చెప్పానుగా నీ చెల్లెలు లాంటిదాన్ని! ఇంతకూ బావగారెక్కడ?" అన్నది లలిత చుట్టూ చూస్తూ.

మంత్రగత్తె, ఒకసారి బాధగా మూలిగి, "ఈ జన్మలో ఆ అదృష్టం వున్నట్టు లేదు! నా మంత్రాలన్నీ నాతోనే అంతరించి పోతాయి," అన్నది.

"అదేంటక్కా! నీ మంత్రశక్తితో, నచ్చిన వాడి మనసు మార్చి కట్టుకోలేకపోయావా?" అన్నది లలిత నవ్వుతూ.

మంత్రగత్తె ఈ సారి మరింత పెద్దగా మూలిగి, "హిమాలయ గుహల్లోంచి, ఇదే బయలుదేరి వస్తున్నానన్న మంత్రగాడొకడు మంత్రాలు నేర్పుతానంటే, ముందు కీడు చేసే మంత్రాలు నేర్చుకున్నాను. విరుగుడు మంత్రాలు, మేలు చేసే మంత్రాలు మనసు మార్చే మంత్రాలు నేర్పకుండానే కొండవాగులో కాలుజారిపడి ఎటో కొట్టుకుపోయాడు," అన్నది

ఇంతలో ఒక ముళ్ళపంది, గుడిసె బయట వున్న చిలగడ దుంప మొక్కల్లోకి వచ్చి, కాళ్ళతో నేల తవ్వడం ప్రారంభించింది. మంత్రగత్తె ఏదో మంత్రం చదివి, క్షణంలో దాన్ని తొండగా మార్చేసింది.

"అద్భుతం, అక్కయ్యా, అద్భుతం!" అంటూ లలిత చప్పట్లు చరిచి, "దాన్ని తిరిగి ముళ్ళపందిగా మార్చాలంటే, ఎలాంటి మంత్రం చదవాలి?" అని



అడిగింది.

"చెప్పాగదా! నా దగ్గిర విరుగుడు మంత్రాలు లేవు. మేలుచేసే మంత్రాలు అంతకన్నా లేవు. ఆ తొండను ఇంకా నికృష్టంగా, ఏ చీడపురుగుగానో మార్చగలను కేవలం నన్ను మాత్రమే ఎలా పడితే అలా మార్చుకోగలను," అన్నది మంత్రగత్తె.

"అయితే పాపం ఆ ముళ్ళపందికి విముక్తిలేదా?" అని అడిగింది లలిత.

దానికి మంత్రగత్తె బళ్ళుమంటూ నవ్వి, "నేను చచ్చాకే దానికి విముక్తి!" అన్నది.

లలిత కొంచెంసేపు వూరుకుని, చప్పున మంత్రగత్తె భుజాలు పట్టుకుంటూ, "నా అనుమానాలన్నీ తీరాయి. ఇక నిజంగా అక్కా చెల్లెళ్ళం

కాబోతున్నాం. మా పెద్దబావను నువ్వు పెళ్ళాడబోతున్నావు," అన్నది.

"నిజంగానా? ఎలా సాధ్యం? నాది వికార రూపం అని అంటుంటారు. మరి, మీ బావను నన్ను పెళ్ళాడేందుకు ఒప్పించగలవా?" అన్నది ఆశగా మంత్రగత్తె.

"ఓ అదెంత పని! మా బావపై కోపగించిన మునీశ్వరుడొకడు, ఆయన అందగత్తెను చేసుకుంటే, తలవేయి వక్కలవుతుందని శాపం పెట్టాడు. నేను బావకోసం వికారుల్లో కటిక వికారిని వెతుకుతూ బయలుదేరాను. అదృష్టం కొద్దీ నువ్వు తారసపడ్డావు," అన్నది లలిత.

"ఆహా, నా వికార రూపమే నా పాలిట వరమైనదన్న మాట! పద, పెళ్ళివారింటికి తరలివెళదాం," అంటూ మంత్రగత్తె, లలితను వేగిర పెట్టింది.

కొంతసేపటికి ఇద్దరూ కుటీరం ముందుకు రాగానే, మంత్రగత్తె అప్పుడే ఏదో ఆలోచన వచ్చినదానిలా తలాడిస్తూ, "ఒక వేళ మీ పెద్దబావ నాకు నచ్చుతాడో లేదో! ముందుగా ఒక సారి చూస్తే ఏం?" అన్నది.

"అలాగే చూడు. ఏ పిచ్చుగ్గానో మారి కిటికీ చువ్వల్లోంచి **లోపలికిపో"** అన్నది లలిత ఉత్సాహంగా.

ఆ మరుక్షణం మంత్రగత్తె, ఊరపిచ్చుకగా మారి బుర్రుమంటూ కిటికీ చువ్వలకేసి ఎగరబోయేంతలో, లలిత దాన్ని పట్టుకుని మెడ నులిమి లోపలికి గిరవాటు వేసింది. హఠాత్తుగా మంచం మీదికి వచ్చి పడిన పిచ్చుకను, గద్దతన కాళ్ళతో తొక్కి పట్టి ముక్కుతో చీల్చి చెండాడేసింది.

ఆ విధంగా, మంత్రగత్తె చావగానే, నరహరికి, ఎప్పటి రూపం వచ్చేసింది. అతడు లలితకు తన కృతజ్ఞలు చెప్పుకుంటూ, "లలితా! నాకు పునర్జన్మను ప్రసాదించావు. జీవితాంతం నీకు ఋణపడి వుంటాను" అన్నాడు.

"నీకు తెలియదా బావా? ఋణాను బంధం వున్నవాళ్లే భార్యాభర్తలవుతారట!" అంటూ లలిత ఆనందంతో పరవశురాలైపోయింది.



# గొప్పలు!

సత్రంలో తమకు అవసరమైనవి కొనుగోలు చేసేందుకు వెళ్ళుతూ, చీకటిపడడంతో దారిలోని ఒక సత్రంలో, ఒక ఆవుల కాపరీ, తోటమాలీ, పహరావాడూ, ఆ రాత్రికి బస చేశారు. ముగ్గురూ మాటల సందర్భంలో తమ వృత్తులేవో తెలుసుకున్నారు. తర్వాత ఎవరి గొప్పగురించి వాళ్ళు డప్పు కొట్టుకోసాగారు.

"నేను అంబోతులా రంకెవేశానంటే, చుట్టుపక్కల కోసుదూరంలో గడ్డిమేస్తున్న పశువులు ఎక్కడివక్కడే చెల్లాచెదురుగా పారిపోవలసిందే!" అన్నాడు మొదటివాడు.

"అది సరే! నేను వేటకుక్కలా భౌమని అరిచానంటే, తోటలో జొరబడ్డదొంగ భయంతో చెట్టెక్కవలసిందే. ఒకవేళ ఏ పులో దారి తప్పి అటువస్తే, తోకముడిచి నాలుక్కాళ్ళ సవారీ మీద అడవికేవేసి పరుగులెత్తవలసిందే!" అన్నాడు రెండోవాడు.

"ఓస్, అంతేనా నేను కోడిలా అర్ధరాత్రివేళ కొక్కొరోకో అని కూశానంటే, తూర్పున సూర్యుడు అప్పటికప్పుడు ఉదయించాల్సిందే!" అన్నాడు మూడోవాడు.

సత్రం అరుగుమీద ఒకమూలగా పడుకునివున్న వేటగాడొకడు, వాళ్ళ గొప్పలు విని, ఒక ఆటపట్టిద్దామని, పులిలా పెద్దగా గాండ్రించాడు.

అంతే! నిజంగా పులి సత్రంలో చేరిందేమోనని ముగ్గురూ, వెంటతెచ్చుకున్న వస్తువులు అక్కడే వదిలి తలా ఒక దిక్కుకు పరిగెత్తారు.



—రామవరపు గణేశ్వరరావు






## ముందుకు సాగుతూన్న అతి పెద్ద ప్రజాస్వామ్యం!

ఎన్నికల కోలాహలం నుంచి ఇప్పుడే మనదేశం బయటపడింది. స్వతంత్ర భారత చరిత్రలో పదమూడవ సారి జరిగిన ఎన్నికలు ఇవి. నూతన ప్రధాన మంత్రికీ, మంత్రి మండలికీ, పార్లమెంటు సభ్యులకూ, ఎన్నికలు జయప్రదంగా జరగడానికి సహకరించిన దేశప్రజలకూ అభినందనలు తెలియజేస్తున్నాం!

ఎన్నికలతో కొత్త లోక్‌సభ ఏర్పాటవుతుంది. మన పార్లమెంటులోని ఉభయ సభలలో మొదటిది లోక్‌సభ; రెండవది రాజ్యసభ. ఒక్కసారి కొత్త లోక్‌సభ ఏర్పాటయితే సాధారణంగా అది ఐదేళ్ళ పాటు కొనసాగాలి. ఆ లెక్క ప్రకారం చూస్తే ఇంతవరకు మనకు పదిసార్లే ఎన్నికలు జరిగి ఉండాలి. అయితే ఇప్పటి వరకు పదమూడు సార్లు ఎన్నికలు జరిగాయి. కారణం కొన్ని లోక్‌సభలు పూర్తికాలం కొనసాగలేక పోయాయి. ఇటీవలి కాలంలో లాగా, పాలక పక్షాలకు చాలినంత మెజారిటీ రాకపోవడం; అవి మిగిలిన పార్టీలపై ఆధారపడడం; ఆ పార్టీలు మద్దతు ఉపసంహరించు కోవడంతో ప్రభుత్వాలు పడిపోవడం, లోక్‌సభలు రద్దుకావడం మళ్ళీ ఎన్నికలు జరగడం అనివార్యమై పోయాయి!

1947వ సంవత్సరంలో బ్రిటిష్ పాలన నుంచి మనదేశం స్వతంత్రం పొందింది. అందుకు మనం అతిపెద్ద మూల్యమే చెల్లించవలసి వచ్చింది. మత కలహాలలో వేలాదిమంది ప్రాణాలు కోల్పోయారు. భారత ఉపఖండంలోని కొంతభాగం పాకిస్తాన్‌గా విడిపోయింది. భారత్-పాకిస్తాన్

---

## నోబెల్ బహుమతి పొందిన జర్మన్ రచయిత

1999వ సంవత్సరం నోబెల్ సాహిత్య బహుమతి సుప్రసిద్ధ జర్మన్ రచయిత గుంటర్ గ్రాస్‌కు లభించింది. 1927 వ సంవత్సరంలో డాన్జిగ్‌లో జన్మించిన గుంటర్ గ్రాస్ దాదాపు ముప్పై సంవత్సరాలుగా జర్మనీలో పలుకుబడిగల నవలా రచయితగా పేరు గాంచారు.

ఆయన నవలలలో సుప్రసిద్ధమైనది 'ది టిన్ డ్రమ్'. రచయిత స్వస్థలమైన డాన్జిగ్‌కు చెందిన ఆస్కర్ అనే ఒక మరుగుజ్జు దృక్కోణం నుంచి రచయిత సమాజాన్ని నిశితంగా పరిశీలిస్తారు. ఆస్కర్ తెలివితేటలు, భావోద్రేకాలు, అవగాహనాశక్తి అందరికిలాగే సహజంగా పెరుగుతాయి. అయితే శారీరకంగా మాత్రం పెరుగుదల లేకుండా పసివాడిలాగే మరుగుజ్జుగా ఉండిపోతాడు.

పసివాడిలావాడు తగరం డబ్బాను వాయిస్తూ ఉంటాడు. హిట్లర్ నాయకత్వంలో

దేశాలు రెండూ ప్రజాస్వామ్య మార్గాన్నే అంగీకరించాయి. ఉభయదేశాలూ ప్రజాస్వామ్య మార్గంలో ఎంతోకాలం ముందుకు సాగలేవని అప్పట్లో పలువురు పరిశీలకులు అభిప్రాయపడ్డారు. పాకిస్తాన్ విషయంలో వారి అంచనా నిజమయింది. సైనిక పరిపాలన లేదా నియంత అధికారం ఈ రెంటి నీడలోనే పాకిస్తాన్ ఎక్కువకాలం గడిపింది. అయితే భారతదేశం ప్రపంచంలోకెల్లా అతిపెద్ద ప్రజాస్వామ్యంగా పురోగమిస్తున్నది. మన ప్రజలు, రాజకీయనాయకులు మరికొంత బాధ్యతాయుతంగా ప్రవర్తించినట్లయితే మనదేశం ఆర్థిక, పారిశ్రామిక, విద్యారంగాలలో అద్భుతమైన ప్రగతిని సాధించవచ్చు ఆసియన్ డెవలప్‌మెంట్ బ్యాంక్ అంచనా ప్రకారం భారతదేశంలో సుస్థిరప్రభుత్వం కనక ఉన్నట్టయితే 2000వ సంవత్సరంలో అది సత్వర ఆర్థిక ప్రగతిని సాధించగలదు. ప్రజలు, ప్రభుత్వాధికారులు, రాజకీయ నాయకులు మరింత దేశభక్తితో నడుచుకోవాలి. అదే ఇప్పుడు కావలసింది!



---

దురహంకార నాజీ అధికారం ఏర్పడి పెరిగి పతనమయ్యేంత వరకు వాడు అలా వాయిస్తూనే ఉంటాడు. 1945 వ సంవత్సరంలో రెండవ ప్రపంచయుద్ధం అంతమయ్యే సమయంలో ఆస్కర్ కాళ్ళు చేతులు పరిపక్వమై



కొంత పెరగడం ఆరంభమై మళ్ళీ ఆగిపోతాయి. బహుశా అది ఆస్కర్ ఆశించిన మరింత అర్థవంతమైన మానవతా విలువలు పెంపొందడం నెరవేరక పోవడానికి సంకేతం కావచ్చు. అనిశ్చిత పరిస్థితిని సూచిస్తూ నవల ముగుస్తుంది. ఒక సంస్థలో ఇంచుమించు ఒక ఖైదీగా ఉన్న ఆస్కర్ విడుదల అవుతాడు. అయితే వాడు ఇప్పుడు ఏం చేయాలి? ఎటు వెళ్ళాలి? అన్నది నిర్ణయించుకోలేక పోతాడు. మళ్ళీ తగరం డబ్బా వాయించడం మొదలు పెడతాడు. ఆఖరికి ఆ శబ్దం తీసుకువెళ్ళే దిశగా పయనించడానికి వాడు నిర్ణయించుకుంటాడు.

నోబెల్ సాహిత్య బహుమతి పొందిన జర్మన్ రచయితలలో గ్రాస్ ఆరవవాడు. ఆయనకు ముందు బహుమతి పొందినవారు థియోడర్ మామ్సెన్ (1902), రుడోల్ఫ్ యూకెన్ (1908), పాల్ వాన్ హేస్ (1910) గెర్హార్ట్ హాఫ్‌మన్ (1922) థామస్ మన్ (1929) హెన్రిక్ బోల్ (1972).



# చందమామ




అర్ధ శతాబ్దికి పైగా, చందమామ భారతీయ బాలలకు ఒక సప్త వర్ణాల వంతెనలా సేవ చేసింది. వారితో వారి వారి మాతృ భాషలలో సంభాషిస్తూ, ఒకేసారి పన్నెండు భాషలలో, ఇంగ్లీషు, సంస్కృతంతో సహా.

ఒక అపూర్వమైన ప్రయోగం - లక్షలాది యువ చదువరులు, వారి తల్లిదండ్రుల ప్రశంసలు పొందింది.

నూతన శతాబ్ది, నూతన శకాబ్ది ఆవిర్భావంతో, మీ పత్రిక నూతన తీరాలను లక్ష్యంగా చేసుకుంది.

భారతదేశంలో కథా రచనలో అత్యంత ప్రీతిపాత్రులైన ఇద్దరిని సంపాదక సలహాదారులుగా తీసుకుంది. వారు రస్కిన్ బాండ్, మనోజ్ దాస్.

ఇప్పుడిక అపురూపమైన విషయసూచిక ఒక్కసారి చూడండి.

## చందమామ 2000

■ భారత దేశ చరిత్ర

ప్రపంచంలో ఎన్నో గొప్ప నాగరికతలు వున్నాయి కానీ, భారత దేశంలో ఏ యితర దేశానికి యిన్ని వేల సంవత్సరాల వారసత్వపు నాగరికత, సంస్కృతి వున్నాయని చెప్పలేము. ఇంత గొప్ప మనుగడ ఎలా సాధ్యమైంది? ఇతిహాసాలు, గతంలోని అద్భుతమైన పాత్రల ద్వారా ఈ మాయాజాలం ముడి విప్పుతున్న శీర్షిక.

■ భారత దేశం అప్పుడు - ఇప్పుడు

ఆధునిక గువహతి (గౌహతి) ప్రాచీన కాలంలో ప్రాగ్ జ్యోతిషపురం అని ఎందుకు వ్యవహరించబడింది? చిన్న చిన్న దీవుల సముదాయమైన ముంబై, ఎలా ఇవాళ్టి నవీన మహానగరంగా రూపుదాల్చింది? ప్రపంచంలోకల్లా భారతదేశంలో భారీ సంఖ్యలో పట్టణాలు దీర్ఘకాల జీవనంతో వున్నాయి. అటువంటి ప్రదేశాల గురించి ఇతిహాసిక, చారిత్రిక విశేషాలు, యిప్పటి వాటి స్థితి గతులతో సహా.

■ నేటి ప్రపంచం

ప్రాపంచిక సంఘటనల గురించి లోలోతు అధ్యయనం...

■ ఈనెల ప్రముఖ వ్యక్తి

ఈ నెలలో జన్మించిన ప్రముఖ వ్యక్తి చేసిన గొప్ప పనులు, జీవిత విశేషాలు...

■ భారత దర్శనం

భారత దేశపు సంస్కృతి, సాహిత్యం, చరిత్ర గురించిన క్విజ్.

మరియు అరడజను కాల్పనిక కథలు - వినోదము - విజ్ఞానము కలగలిసి. ఇవన్నీ - వార్తలూ - విశేషాలూ చందమామ కబుర్లు, విలువైన నీతిసూత్రాలతో పాటుగా.

చందమామ - మీ జీవిత సహాధ్యాయి మరియు నూతన తీరాలకు మీ మార్గదర్శి!



# ఫోటో వ్యాఖ్యల పోటీ

ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.



ఫోటో వ్యాఖ్యల పోటీ
చందమామ
వడపళని
చెన్నయ్-600 026





వ్యాఖ్యలను పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25 వ తేదీలోగా మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు ఫిబ్రవరి 2000 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ.100 బహుమానం.

## అభినందనలు



జనవరి '98 నెల సంచికలో
బహుమతి పొందిన వ్యాఖ్యలు
పంపినవారు:
పడాల శివశంకరమూలారెడ్డి,
విజయవాడ:520 003



బహుమతి పొందిన వ్యాఖ్యలు
మొదటి ఫోటో: మృగరాజులుంగారు వేంచేసి ఉన్నారు!
రెండవ ఫోటో: గజరాజులందరూ బహుపరాక్!

